శ్రీ రామాయనమః

# శకుంతల చరిత్రము



విరచితము

శ్రీ ఆంధ్ర వాల్మీకి

## వాసుదాస స్వామి



శ్రీరామ

# ఆర్యచరిత్ర రత్నావళి

# శకుంతలాచరిత్రము

(రెండవ రత్నము)

వావిలికొలను సుబ్బారాయ
విరచితము



శ్రీకోదండ రామ సేవక ధర్మసమాజము,
శ్రీరామసేవా కుటీరము - ఒంటిమిట్ట,
కడప జిల్లా.

## విజ్ఞప్తి

బ్ర॥ శ్రీ॥ వావిలికొలను సుబ్బరాయ రచిత గ్రంథములన్నియు శ్రీ మదొంటిమిట్ట కోదండరామ కైంకర్యములకై యీయఁబడినవి. కావున నీ గ్రంథములను జదువువా రార్యనీతి మతాచార భక్తితత్త్వంబుల నెఱింగి బాగుపడుటయే కాక భగవత్సేవా ధర్మంబునకు నన్నదానంబునకుఁ దోడుపడిన పరమపుణ్యంబును నార్జింపఁ గలరు.

**యం.వి. సుబ్బరావు**
ధర్మకార్యనిర్వాహక విశ్వాసి
మేనేజింగ్ ట్రస్టీ

శ్రీరామజయమందిరము
తిరువళిక్కేణి
15-10-1924.



దాతారం సర్వసంపదామ్

ఆపదా మపహర్తారం



లోకాభిరామం శ్రీరామం

భూయో భూయో నమామ్యహమ్

కం. నీ పాదకమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యము నునితాం
తాపార భూపదయయును
దాపసమందార నాకు దయసేయఁగదే.



శ్రీ పద్మావతీదేవి





శ్రీరామచంద్రాయనమః

# ఆర్యచరిత్ర రత్నావళి

# శకుంతలా చరిత్రము

## రెండవ రత్నము

రుక్మిణి : అప్పా! మనస్సును నీవు గెలిచితివా చంద్రమతి వయ్యెదవు. మనస్సు నిన్ను గెలిచెనా కలకంఠి వయ్యెదవు అని నిన్న రాత్రి నివు చెప్పితివిగదా. మనస్సును గెలుచుట అనిన ఏమో నాకు తెలియలేదు. తెలియఁజెప్పుము.

తండ్రి : నీవు ఒక మంచి మామిడిపండు చూచితి వనుకో. దానిని తినవలయు నని కోరిక నీకు కలుగును గదా. అట్లు కోరునది యేది?

రుక్మిణి : మనస్సు.

తండ్రి : అట్టులే ఏ విషయమును గుఱించియైనను కోరకిలు కోరునది మనస్సు. తెలిసినదా?

రుక్మిణి : తెలిసినది.

తండ్రి : నీవు చూచిన మామిడిపండు తినవలయునని నీకు మనస్సులో కోరిక పుట్టెను గదా. తరువాత నీవేమి చేయుదువు?

రుక్మిణి : దానిని దుడ్డిచ్చి కొని తిందును.

తండ్రి : నీ చేత దుడ్డు లేదనుకో.

రుక్మిణి : నిన్ను అడుగుదును.

తండ్రి : నే నీయ ననుకో.

రుక్మిణి : ఊరకుందును.

తండ్రి : ఊరకుందు ననఁగా నేమి? నీ మనస్సు మామిడిపండు కావలయునని కోరెను. నీవు అక్కఱ లేదనుకొంటివి. కాఁబట్టి నీ మనస్సు కోరిన ప్రకారము నడచుకొనక పోయితివి కదా?

రుక్మిణి : అవును.

తండ్రి : నీ మనస్సు చెప్పిన ప్రకారము నీవు వినకపోయినపుడు నీవు గెలిచినట్టా నీ మనస్సు గెలిచినట్టా?

రుక్మిణి : నేనే.

తండ్రి : నీ మనస్సులోని కోరిక తీర్ప నీవు ఆ పండును దొంగిలించితివనుకో. ఎవరు గెలిచినట్టు?

రుక్మిణి : మనస్సు గెలిచినట్టు. దొంగతనము చేసిన పాపము రాదా?

తండ్రి : పాప మొక్కటే అనుకొంటివా? "దొంగతనము ఎన్నఁటికి దాఁగదు" అని చెప్పఁగా వినలేదా! నీ దొంగతనము బయటపడఁగానే అందఱు నిన్ను అవమానము చేయుదురు. ఒకరును నిన్ను నమ్మరు. దగ్గఱకు రానీయరు. ఎక్కడ ఎవరింటిలో ఏది పోయినను ఆ దొంగ పిల్ల వచ్చి యుండనేమో. దానిని అడిగిన తెలియును. దాని గుడ్డవిప్పి పరీక్ష చేయుఁడు అని నలుగురిలో అవమానము చేయుదురు. రక్షకభటులకు తెలిసిన పట్టుకొని పోదురు. అధికారులు శిక్ష చేయుదురు. ఇదంతయును ఈ లోకములో చచ్చిన పిమ్మట యమలోకములో జరుగు శిక్ష నరకపటములో చూడలేదా.

రుక్మిణి : చూచినాను.

తండ్రి : ఈ కష్టములన్ని ఏల కలిగెను!

రుక్మిణి : మనస్సు చెప్పినట్టు విని దొంగిలించుట చేత.

తండ్రి : కాఁబట్టి మనస్సు కోరినదని నీవు చేయరాని పని చేసితివా నీకు పాపము అవమానము వచ్చును. మనస్సులో కోరిక పుట్టఁగానే ఇది మంచి కోరికా? చెడ్డ కోరికా? ఈ కోరిక ప్రకారము మనము నడచుకొనిన యెడల పుణ్యము వచ్చునా? పాపము వచ్చునా? ఏదియును రాదా? అని ఆలోచింపవలయును. పాపము వచ్చునని తోఁచెనా ఆ పని చేయనే రాదు. పుణ్యము వచ్చునని తోఁచిన తప్పక చేయవలయును. రెండు లేనియెడల నీ యిష్టము.





రుక్మిణి : పాపము పుణ్యము రెండును లేక యెట్లు పోవును?

తండ్రి : పండుగునాఁడు నీ సొమ్ములు నీవు పెట్టుకొనవలయునని కోరిక పుట్టెననుకో. నీవు నీ సొమ్ములు పెట్టుకొంటివేని అది పుణ్యమా? పెట్టుకొనకున్న పాపమా? ఏదియును లేదు.

రుక్మిణి : ఇది పుణ్యము ఇది పాపము అని నా కెట్లు తెలియవలెను?

తండ్రి : దొంగిలించిన పాపము రాదా అంటివే అది నీకెట్లు తెలిసెను?

రుక్మిణి : అందరు అనఁగా వినియుంటిని. అది ఆ సమయమునకు జ్ఞప్తికి వచ్చెను.

తండ్రి : ఇది పుణ్యము. ఇది పాపము. ఇది చేయవచ్చును. ఇది చేయరాదు అని చిన్నవారికి పెద్దవారు చెప్పవలయును. చిన్నవారు దానిని జ్ఞప్తియందుంచుకొనవలయును. మనస్సు ఏదైన పాపపు కోరిక కోరెనా వెంటనే నీలో బుద్ధి యనునది "ఇది పాపకార్యము నీవు చేయవలదు" అని చెప్పును. ఆ ప్రకారము నీవు వినవలయును. మొదటిసారి చాల బలముగా పలుమాఱు చెప్పును. వింటివా సరి. వినకపోయితివా రెండవసారి పాపము చేయునపుడు కొంచెము తక్కువగాఁ జెప్పును. అప్పుడును వినక పోయితివా తరువాత నీకు బుద్ధి "ఇది చేయఁగూడదు" అని చెప్పనే చెప్పదు. బుద్ధి చెప్పినట్టు వినక మనసు చెప్పినట్టు ఎపుడు పోయితివో నీవు చెడిపోవుట నిశ్చయము. ఏదైన చెడు కార్యము చేసినపుడు "నీకు బుద్ధి లేదా" అని అందఱు అనఁగా వినలేదా. దానికిదే అర్థము.

రుక్మిణి : పుణ్యము అనిన నేమి? పాపము అనిన నేమి?

తండ్రి : ధర్మమును తప్పక యితరుల మనస్సునకు సంతోషము గలుగునట్లు ఉపకారము చేసితివా అది పుణ్యము. ధర్మము తప్పి ఇతరుల మనస్సునకు నొప్పి కలుగఁ జేసితివా అది పాపము.

రుక్మిణి : నిన్న నే నడిగినదానికి కథ చెప్పెద నంటివే.

## శకుంతలా చరిత్రము

తండ్రి : శకుంతల చరిత్రము చెప్పెద వినుము. ఒక కోరిక పుట్టినప్పుడు ఆ విషయమై బుద్ధిమంతు లెట్టు లాలోచింతురో యదియును దానివలనఁ దెలియును.

చంద్రవంశపురాజులలో దుష్యంతుఁడను రాజుండెను. అతఁ డొకనాఁడు గొప్పసేన తోడ వేఁటాడుటకై అడవికి బోయెను. అట్లు వేఁటలాడు సమయమున నొక జింక ఆయన గుఱికి చిక్కక తప్పించుకొని పరుగెత్తెను. ఆ రాజు రోషముచేత దానిని వెంబడించెను. ఇట్లు చాల దూరము తఱుముకొని పోయి యెదిగి బాణము వేయఁబోవు సమయమున ఇద్దఱు ఋషికుమారులు అడ్డము వచ్చి నిలిచి చేతులెత్తి "రాజేంద్రా! వలదు వలదు. ధర్మాత్ములని పేరు గన్న రాజులలో నీవు మేటివి. గొప్ప వంశమున పుట్టినవాఁడవు. అట్టి నీవు నిష్కారణముగ ఆశ్రమ మృగమును జంపవచ్చునా? నీ భుజబలము పాపాత్ములను దండించుటకా నోరులేని జంతువుల హింసించుటకా? ఈ పెంపుడు జింక మీఁద నీవు బాణములు వేయుట పూలదండ మీఁద నిప్పులు పోయుట కాదా" యనిరి.

ఆశ్రమ మృగము అని విన్నతోడనే రాజు ఎక్కు దించి వింటిని తేరిమీఁద నుంచి తేరు దిగి ఆ బాలకుల యొద్దకుఁ బోయి నమస్కరించి మునిపుత్రకులారా!



ఋషులు దుష్యంతుని ఆశ్రమ మృగమును జంపవలదని చెప్పుట





ఇది యెవరి ఆశ్రమమని యడిగెను. ఇది కణ్వ మహాముని ఆశ్రమమని వారు చెప్పి "రాజా నీవు గుణవంతుఁడవు. నీకు శీఘ్రకాలమందే చక్రవర్తి యగు కుమారుఁ డుదయించుగాక" యని ఆశీర్వదించి "ఇంత దవ్వు రానే వచ్చితివి. మబా గురువుల వారిని దర్శించి పొమ్ము" అనిరి. "మీ గురులవా రుటజంబున నున్నారా?" యని రాజడిగెను. "లేరు. ఇప్పుడే వారు పుష్పాదులకై మాలినీతీరమునకుఁ బోయిరి. వారి కూఁతురు శకుంతల యతిథుల సత్కరింప నియమింపఁబడి యింటనున్నది" అని వారు చెప్పిరి. "పుష్పములకుఁ బోయినవా రాలసింతురా? పెద్ద దర్శనము శుభకారణము. వారిని దర్శించి పోయెదను" అని దుష్యంతుఁడు తలఁచెను.

అమ్మణ్ణి : ఆశ్రమమనఁగా నేమి?

తండ్రి : ఋషు లెల్లప్పుడు దేవునినే ధ్యానించుచుందురు. నిశ్శబ్దముగా నుండినగాని దేవుని మీఁద చాలసేపు మనస్సు నిలువదు. దేవుని మీఁదనే చాలసేపు మనస్సు నిలిచినఁగాని దేవుఁడు కనబడఁడు. గనుక వారు అడవులలో తోఁపు లేర్పఱుచుకొని అందులో ఆకుటిండ్లు కట్టుకొని తపస్సు చేయుచుందురు. అట్టి తోఁపులకు ఆశ్రమములని పేరు. వారుండు ఆకుటిండ్లకు ఉటజములని పేరు. కణ్వుఁడుండు ఆశ్రమమునకు కణ్వాశ్రమమని పేరు.

### దుష్యంతుఁడు కణ్వాశ్రమములోనికి పోవుట

తరువాత దుష్యంతుఁడు రథము నచ్చటనే సారథి వశమున విడిచి వేఁటగాని వేషము వదలి మంచి వస్త్రముల ధరించి ఒంటరిగా ఆశ్రమములోనికి పోయెను. అది ఆయనకు మిగుల కనులపండు వొనర్చెను. కాయని చెట్టును, పూచని తీఁగదయును, ఆయనకు కనఁబడలేదు. భాగ్యము వచ్చినపుడు గుణవంతులెట్లు అడఁగి యుందురో అట్లు ఫలవృక్షము లన్నియు కాయలచేతను పండుల చేతను నిండి నేలకు వ్రాలి యుండెను. నేలఁ బండుకొని పండులను నోటితోనే తినవచ్చును. అలంకారము చేసికొనిన సిగ్గరి కత్తెవలె కొమ్మలెల్ల పూల గుత్తులచేతను చిగురు జొంపములచేతను తలలు వ్రాల్చి గాలికి మెల్లగ కదలుచుండెను. పండ్ల బుట్టకు బాలురవలెఁ దుమ్మెదలు జుమ్మని చెట్లకు

ముసరుచుండెను. పరులను బాధించుటచే దుష్టులను పోలిన ముండ్లచెట్లు ఆ యాశ్రమమం దెందును లేక ధర్మము విడువక పరిపాలించు రాజు రాజ్యమును బోలి అది హాయిగ నుండెను.

పులు లావు లొక్క పొలమునఁ దిరుగుచుండెను. సింహములు మేఁక లొక్క రేవున నీరు త్రాగుచుండెను. ఆ ముని శాంతము భూతదయ గలవాఁడు గావున ఆ యాశ్రమమందుఁ గల అన్ని జీవజంతువులు పగయును, క్రోధము లేక నిర్భయముగ చరించుచుండెను. తళతళ మెఱయు పసరుపట్టు చీర కట్టుకొని, తలనిండఁ బూలు పెట్టుకొనిఁ ముఖమున కుంకుమ బొట్టు పెట్టుకొని, చిఱునవ్వు నవ్వుచు, ఉల్లాసముగా నుండు పెండ్లికొమార్తెవలె లేఁత పసరుటాకులతో, నిండార విరిసిన పువ్వులతో, తొగరు జిగురులతో, వనలక్ష్మి రమ్యమై యుండెను. రాజును గౌరవింపఁ గోరి పఱచిన పట్టు దుప్పటముల వలె పచ్చిక పట్టులు మెత్తనై సుఖమిడుచు నుండెను. చెలులు వీచు వట్టి వేళ్ల వీవనల గాలివలెఁ గొమ్మలనుండి చల్లని మెల్లని కమ్మని గాలి వీచుచుండెను. ముత్తైదువలు పాడునట్టి పెండ్లిపాటలవలె ఆఁడు కోవెలలు గానము సేయుచుండెను. నర్తకుల వలె నెమిళ్లాడుచుండెను.

పెండ్లికొడుకు శిరము మీఁదఁ బోయు తలఁబ్రాలో యన్నట్లు కొమ్మలు పూవులను ఆయనపై రాల్చుచుండెను. గంధపొడి వలె పుప్పొడి ఆయనపై పడుచుండెను. వసంతము లాడినట్లు మోదుగపూలు ఆశోక కుసుమములు నేల నిండియుండెను.

రుక్మిణి : అప్పా! అప్పా! నీవు చెప్పఁబోవునది నాకు తెలిసినది.

తండ్రి : ఏమి తెలిసినది?

అమ్మణ్ణి : నాకును తెలిసినది. రాజునకు పెండ్లి అగును.

## రాజు శకుంతలతో సంభాషించుట

తండ్రి : ఇవన్నియుఁ జూచుచు రాజు పోయి పోయి పర్ణశాల యొద్ద నిలఁబడి చూడఁగా నందెవ్వరు కాన రాకుండుటచే "ఇందెవ్వరును లేరా" అని గట్టిగ అఱచెను.





ఆ ధ్వని విని నారచీరలు కట్టుకొన్న యొక చిన్నది వచ్చి రాజని యెఱిఁగి యిట్లనియెను. "రాజేంద్రా! మా తండ్రి కణ్వమహామునులవారు ఆశ్రమంబున లేరు. మాలినీ తీరమందున్న వనంబునకుఁ బోయియున్నారు. ఇంచుకసేపు మీ రిచ్చట గాసిదీఱ కూర్చుందురేని వారు వచ్చి మిమ్ము సత్కరింతురు" అని మృదువుగను మధురముగను బలికెను. ఆమె మిక్కిలి యందగత్తె. ఆమెను జూడఁగనే రాజునకు ఆమెను వివాహము చేసికొనవలయునని ఆశ పుట్టి యిట్లు తలఁచెను. "ఆహా ఏమి యీ చిన్నదాని సౌందర్యము! నారచీరలు కట్టుకొని యున్నను బాలనాఁచు కప్పిన కమలమువలె మంచుతోడి హిమకిరణునివలె నందముగనే యున్నది. చక్కఁదనము గలవారి కేది యలంకారము కాఁజాలదు? ఈమె వాసన చూడబడని పుష్పము. గోరు తగులని చిగురు. బెజ్జము వేయఁబడని రత్నము. తుమ్మెద యంటని క్రొత్తపూఁదేనె. ఈ బాలికను వివాహమాడిన వాఁడే పురుషులయందు శ్రేష్ఠుఁడు. మంచి పుణ్యము చేసినవాఁడు" అని తలఁచి మరల నిట్లనుకొనెను. "ఛీ, ఏమి నా పాడు మనస్సు. నేను క్షత్రియుఁడను. ఈ చిన్నది బ్రాహ్మణుని కూఁతుర ననుచున్నది. ధర్మము తప్పిన కోరిక నేను కోరవచ్చునా? కూడదు" అని మరల నిట్లు లాలోచించెను. "నే నెన్నఁడు పాపపుఁ గోరికల కోరినవాఁడను గాను. అధర్మకార్యము లందు నా మనస్సుపోదు. ఇట్లుండ నిప్పుడు మాత్రము అధర్మపుఁ గోరికను నా మనస్సు కోరునా? కోరియుండదు. సందేహ విషయములందు సజ్జనులకు అంతఃకరణమే ప్రమాణము. నా అంతఃకరణము శుద్ధముగా నున్నది. కణ్వునకు భార్యయే లేదు. ఈ చిన్నది ఆయనకు కొమార్తె యెట్లు కాఁగలదు? కావున నింకను విచారించెదఁ గాక" అని తలఁచి "బాలికా! నా సేనలు నన్ను వెదకుచుండును. నేను నిలువరాదు. త్వరగా బోవలయును. నీవు తియ్యని మాటలచేతనే నన్ను సత్కరించితివి. ఏ కొఱతయు లేదు. కాని నాకొక సందేహము కలదు. కణ్వమహామునికి భార్య లేదని ప్రసిద్ధి. నీ వెట్లు కూఁతురవైతివో వినఁగోరెద. నీవు చెప్పఁగూడిన నేను వినఁ గూడిన చెప్పెదవా" అని యడిగెను. శకుంతల చిఱునవ్వుతో నిట్లనియె.

## శకుంతల తన జన్మవృత్తాంతము రాజునకు దెల్పుట

"రాజచంద్రమా! పూర్వ మొక ఋషి మా తండ్రిగారిని జూడవచ్చి యిప్పుడు నన్ను ప్రశ్నించినట్టే వారిని ప్రశ్నించెను. అప్పుడు మా తండ్రిగారు

ఆయనకు చెప్పిన ప్రత్యుత్తరము నేనుమీకు చెప్పెదను. "మీరు విశ్వామిత్రుఁడను మహాముని పేరు వినియుందురే కదా. ఆయన బ్రాహ్మణత్వము కోరి ఘోరమైన తపస్సు చేసెను. దానికి ఇంద్రుఁడు భయపడి ఆయన తపస్సు చెఱుపవలయునని యెంచి మేనకయను దేవతా స్త్రీని బిలిచి "మేనకా! విశ్వామిత్రుని తపము నాకు భయము పుట్టించుచున్నది. ఆయన తపము నీవు చెఱిపి రావలయును. నా కీమాత్రము ఉపకారము నీవు చేయవలయును" అని చెప్పెను. ఆ మాటలు



*మేనక వినయవేషముతో విశ్వామిత్రు సమీపించుట*

విని మేక నవ్వి "సురరాజా! విశ్వామిత్రుఁడు మహాకోపి యని మీ రెఱుఁగరా. తెలిసి తెలిసి కొఱవితో తల గోఁకుకొనుమని చెప్పుట మీకుఁ దగునా? పురుషులందు శ్రేష్ఠులగు మీకే ఆయనను జూచి భయమైన యెడల స్త్రీనగు నాకు భయము కలుగుట ఆశ్చర్యమా? అయినను మీరు నాకు ప్రభువులు. మీ యాజ్ఞ మీఱరాదు. పోయి వచ్చెదను" అని చెప్పెను. ఇంద్రుఁడు వెడలిపోయెను.

మేనక మిక్కిలి శృంగారించుకొని యిట్లు తలంచెను. నయమున నగు కార్యములు భయమునఁ గావు. నయమున మోసగించి విషయమైన





తినిపింపవచ్చును అని యెంచి చక్కఁగ ఆ విశ్వామిత్రుఁ డుండుచోటికిఁ బోయి నమస్కరించి నిలఁబడి "మునీంద్రా! మీ మనోహరము పుణ్యమునగు ఆశ్రమున నించుకసేపు విహరించి సేద దీర్చుకొని పోవఁ గోరిక కలదు. అనుజ్ఞ ఇచ్చెదరా"యని మిక్కిలి వినయముతో తేనెమాటలతో వేఁడుకొనెను. విశ్వామిత్రుఁడు దాని యుద్దేశము తెలియనేరక యట్టులే కానిమ్మనెను. అది ఆ వనమున మిక్కిలి యింపుగ నాడుచు సొంపుగ పాడుచు వేడుకల సేయుచు పూలు గోయుచు తిరిగి తిరిగి సాయంకాలమునకు సరిగ నందున్న యొక్క సరోవరంబున జలకమాడుచుండెను. అది విశ్వామిత్రుఁడు స్నానము సంధ్య లోనగు కార్యములు దీర్చు కొలను. ఆయన సాయంకాలమున స్నానము చేయుటకై యచ్చటికే పోయెను. పోయి చూచునప్పటికి మేనక ఉల్లిపొరనుండు సన్నని తెల్లని దువ్వలువ కట్టుకొని స్నానము చేయుచుండెను. తడిసిన యా జిలుఁగు వస్త్రము దేహమునకే కఱచుకొనిపోఁగా చీర కట్టుకొననట్టే దేహము తెలియుచుండెను. ఆ శరీర కాంతికి ఆ చీర దీపమునకు గాజు కుప్పెవలె నుండెను. ఆ స్థితియందు దానిని చూడఁగానే విశ్వామిత్రునకు మనసు చెదరి తాను వచ్చిన కార్యము తాను తపస్సు చేయు ఉద్దేశము అంతయు మఱచి తటాలున పోయి దానిని బట్టుకొనెను.

తండ్రి : చూచితిరా. స్త్రీలు సన్నవస్త్రములు కట్టుకొని యేళ్లయందుఁగాని కొలఁకులయందుఁగాని స్నానము చేయుటవలనఁ గలుగు కీడు. సిగ్గు శీలము గల స్త్రీలు అట్లు స్నానము చేయరు. సిగ్గు విడిచిన వారే అట్లు చేయువారు. మేక విశ్వామిత్రుని తపము చెఱచుటకై వచ్చినది గనుక ఆయన తన్నుఁ బట్టుకొనినది యిష్టమైనను బోగపు వగల చేతను తటాలున లోపడిన మోసము తెలిసి శపించునను భీతిచేతను కొంత సేపు తన్ను దాఁకవలదని బతిమాలి నట్టు బతిమాలెను.

తరువాత వారిరువురు భార్యాభర్తల వలెఁ గొన్ని సంవత్సరములుండిరి. వారి కీ కన్య జనించెను. మేనక యీ పిల్లను విశ్వామిత్రునకుఁ జూపి నీ బిడ్డను నీవు తీసికొమ్మని చెప్పఁగా తన తపస్సునకు విఘ్నమాయెనను దుఃఖముతోను సిగ్గుతోను విశ్వామిత్రుఁ డీ బిడ్డను గైకొనఁడయ్యెను. లంజకు పిల్ల తగులాట మన్నట్టు నాకేల యీ జంజాటమని మేనక దీనిని మాలినీ

తీరమున ఒక చెట్టు క్రింద పాఱవైచి పోయెను. శకుంతము లీమెను రక్షించుచుండెను. ఆ సమయంబున నే నొకనాఁడు ఆ యేటియొద్దునఁ సంచరించుచు ఈ పిల్లను చూచి యింటికి తెచ్చి నాఁడు మొదలు రక్షించుచున్నాను. శకుంతముల చేత రక్షింపఁబడుటచే నీమెకు శకుంతల యని పేరు పెట్టితిని. జనకుఁడు, అన్నదాత, భయము వలన కాపాడినవాఁడు ముగ్గురు స్త్రీలకు గురువులు. వీరు ముప్వురుగాక ఉపనయనము చేసినవాఁడు విద్య చెప్పినవాఁడు అని పురుషునకు ఏవురు గురువులు. ఈమె నాకు ఈ కారణముచేఁ గూఁతురయ్యెను" అని నేను పుట్టిన వృత్తాంత మిట్లు నా తండ్రిగారు చెప్పిరి.

## దుష్యంతుఁడు శకుంతలను పెండ్లి చేసికొనుట

శకుంతల చెప్పిన వృత్తాంతము దుష్యంతుఁడు విని మనుష్య స్త్రీయందుఁ బుట్టినదాని కిట్టి తేజముండునా? ఎందైన భూమినుండి మెఱుపులు వెలువడునా? నా కోరిక నెఱవేఱు మార్గము కలిగెను. దేనిని తాఁకరాని నిప్పుకణమని భయపడుచుంటినో యది వెలలేని కెంపు అయ్యెను అని సంతోషించి రమణీ! కణ్వమహర్షులు సంసార సుఖజ్ఞానము లేనివారుగ నున్నారుగా యనెను.

శకు : జ్ఞానదృష్టిచే సర్వజ్ఞులు.

దుష్యం : అట్లైన నీకు వివాహము సేయక యీ మృగములతో పాటు నిన్నేల యుంచినారు?

శకుంతల : "తగిన........" అని సిగ్గు చేతఁ దల వంచుకొనెను.

ఆమె యభిప్రాయము గ్రహించి దుష్యంతుఁడు "సుందరీ! నీవు క్షత్రియకన్యకవు. నేను క్షత్రియుఁడను. మన వివాహము మన యిరువుర కులమునకు శీలమునకుఁ దగి యుండునని నాకుఁ దోఁచుచున్నది. నా కోరిక ప్రకారము నీవు నన్ను పెండ్లాడితివా, నీవు కోరిన ఆభరణములు వస్త్రములు లోనైన వెల్ల నిచ్చి నిన్ను నా పట్టపుదేవిగఁ జేయుదును" అని దుష్యంతుఁడు చెప్పఁగా సిగ్గున శకుంతల తలయెత్తక "రాజవరా! తండ్రిచాటు కన్నెను. స్వతంత్రనుగాను. నన్ను దానము చేయ వారర్హులు.





కం. **"కారుణ్యరతులు ధర్మో**
**దారులు నామీఁద నెవరు తప్పరు జనకుల్**
**కూరిమి వా రిచ్చినచో**
**క్ష్మారమణా! పరిణయంబు కమ్మీ నన్నున్.** భా.

ఆ మాటలు దుష్యంతుఁడు విని "బాలా! నా మాటలు విని చక్కఁగ నాలోచింపుము. నీవు రాచకన్నెవు. కణ్వుఁడు బ్రాహ్మణుఁడు. ఆయన నిన్నేమని నాకు దానము చేయును? అట్లు చేయుట ఏ వివాహమగును? మన మిరువురము క్షత్రియులము. క్షత్రియుల కర్హమైన వివాహము మనకుఁ దగును. క్షత్రియులందు గాంధర్వవివాహము ప్రశస్తము.

తే. **"తనకు మఱి తానె చుట్టంబు, తానె తనకు**
**గతియుఁ దన్నిచ్చుచోఁ దాన కర్త, యనఁగ**
**వనజనేత్ర! గాంధర్వ వివాహ మతిర**
**హస్యమును సమంత్రకమును నగుచు నొప్పు"** భా.

ఆ వివాహమునందు నిన్ను నీవే దానము చేసికొను నర్హత గలదు. అయినను "నన్ను సాఁకి సంతరించిన వారితోఁ జెప్పక యిట్టి కార్యము నేను స్వతంత్రించి చేయవచ్చునా? అందువేమో నీవు కులహీనుని వరింపలేదు. శాస్త్రమునకు విరోధముగ వర్తింప లేదు. గుణహీనునిపై నాశపడలేదు. పెద్దవారలకుఁ దెలిసిన నాక్షేపింతురేమోయను భయమునకుఁ గారణము లేదు. ఇది లోకాచారమునకు విరుద్ధము గాదు. నేను దరిద్రుఁడఁగాను. కురూపిని గాను. పాపిని గాను. కావున నేమి చేయరాని పని చేసితిమని మనపై వారు కోపింతురు? ఇప్పుడు నాకుఁ గాకున్న ఏనాఁడైన నెవనికైన నిన్ను వా రియ్యవలసిన వారే కదా? క్షత్రియులందు నాకంటె గొప్పరా జెవఁడును లేఁడని వారెఱుఁగరా? నీ వెఱుఁగవా? ఇంటికి వచ్చి ప్రేమించి ప్రార్థించిన నన్ను విడనాడి రేపు మఱియొక హీనుని నీవు చెట్టపట్టవలసి వచ్చిన యెడల ఇప్పుడు నీవు చేసిన యవివేక కార్యమున కప్పుడు ఎంతగ పరితపింతువో ఆలోచింపుము. ఈ తిరస్కారమునకు తండ్రి నిన్నేమియనునో యూహింపుము. కావున నీవు భయపడవలసిన కారణము లేదు" అని చెప్పఁగా ధర్మశాస్త్ర లోకాచార సమ్మతములైన ఆయన వాక్యములు విని సమ్మతించి ఆయనను

మోహాంధకారమున ముంచుటకో యన కురుల నీలకాంతు లాయనపై ప్రసరింప తలవంచి కాలి బొటనవ్రేలు చూచుచు మెల్లని మాటల,

**చ. "నరనుత! నీ ప్రసాదమున నా కుదయించిన నం**
**దనున్ మహీ! గురుతర యౌవరాజ్యమునకున్ దయ**
**తో నభిషిక్తుఁ జేయఁగా! వరము ప్రసన్నబుద్ధి నన**
**పద్యముగా దయసేయు నెమ్మితో। నిరుపమకీర్తి! యట్ల**
**యిన నీకును నాకును సంగమంబగుఙ"** భా.

అని యడిగిన "నీయందు జన్మించు కుమారుని నవశ్యము యువరాజుగఁ జేసెదను" అని నమ్మఁబలికి రాజామెను వివాహము చేసికొనెను. "ఇప్పుడేనీవు నా వెంట వచ్చిన మీ తండ్రిగారు మనల శపింతురు, శీఘ్రకాలమునందే నిన్ను నా పురమునకుఁ దోడ్కొని వచ్చుటకై వాహనములను పరివారమును బంపెదను. నీ తండ్రి నింతలో శాంతి పఱుపుము" అని రాజు చెప్పి బయలు దేరి పోయెను. క్రొత్తగ భార్యాభర్తలగు వారు ఒకరిని విడిచి ఒకరు పోవలసి వచ్చినపుడు వారి మనస్సు లెట్టులుండునో మీరే యూహించుకొనుఁడు.

రాముఁడు : ఎట్టులుండునో నాకు తెలియలేదు.

కృష్ణుఁడు : నాకును తెలియలేదు.

తండ్రి : మీకు పెండ్లి అయినప్పుడు తెలియదు. మీ మనస్సునకు మిక్కిలి సంతోషము నిచ్చు వినోదమైన ఆటను మీరు చూచుచుండునపుడు ఎవరైనను మిమ్ము రెట్టపట్టికొని యీడ్చుకొని వచ్చిన మీ మనస్సు కాళ్లు కన్ను లెచ్చట నుండును?

రాముఁడు : కాళ్లు ముందఱకు మనస్సు వెనుకకు పోవుచుండును. కన్నులు తిరిగి తిరిగి చూచుచుండును. మనస్సు తహతహ లాడుచుండును.

తండ్రి : దుష్యంతునకు ఆ ప్రకారమే యుండెను.

గాలి కెదురుగ ధ్వజ మెత్తుకొని పోవునపుడు ధ్వజదండమును బలవంతముగ ముందఱకు తీసికొని పోదువు. కొనను గట్టిన వస్త్రము వెనుకకే పోవుచుండును గదా. ఆ ప్రకారముగా దుష్యంతుఁడు పోవ నిష్టము లేకున్నను





పోవక తప్పదు. కావున శరీరము మెల్లగ ముందు పోయినను మనస్సు వెనుకకు పరుగెత్తుచుండెను. దుష్యంతునందు నిలిచిన శకుంతల చూపులును తామర తూఁడు నుండి తీయఁబడు నారలవలె ఆయనవెంటనే చెట్ల మఱుఁగగు వఱకు పోయెను. ఊరు చేరి మనస్సు కుదుటఁ బడిన తరువాత దుష్యంతుఁ డిట్టు లాలోచించెను. "త్వరపడి నే నెంతకార్యము చేసితిని. ఆత్రగానికి బుద్ధిమట్టు. నేను చేసినపని తెలిసికొని కణ్వుఁడు కోపించునో శపించునో? శకుంతలనేమి చేయునో. ఆయన మహాత్ముఁ డట్లు ఏలచేయును గాని నేనేమని వాహనములు పరివారములు పంపుదును. అట్లు పంపుట ఆయనకుపుండునందు ఉప్పుకూరి నట్టుగా నుండదా? అగునది కానిమ్ము. ఎవరిని నేను పంపను. ఆయనకు శాంతము వచ్చి ఆ బాలికను పంపెనా పంపనీ. లేకున్న ఆ చిన్నదియే తండ్రికి సమాధానము చెప్పి వచ్చినప్పటికి రానీ. నేనేల చెట్టు కొట్టి మీఁద త్రోసికొనవలయును" అని తలఁచి యూరకుండెను.

అచ్చట కణ్వమహాముని మాలినీనది యందు స్నానము సంధ్య జపము తపము దీర్చుకొని ఫలకుసుమాదులు సేకరించి యాశ్రమమునకు వచ్చెను. ప్రతిదినము తండ్రి యింటికి రాకముందే శకుంతల దర్భాసనము మీఁద కృష్ణాజినము దానిమీఁద మడుఁగు వస్త్రము పఱిచి దేవపూజకు అగ్నిహోత్రమునకు కావలసిన పదార్థములన్నియు సిద్ధముగ నుంచి తండ్రి రాఁగానే ఆయన పాదములు కడిగి, తెచ్చిన పదార్థముల నందుకొని, పదిలపఱుచుచుండుట వాడుక. ఆ నాఁడు శకుంతల ఎదురుగ రాలేదు. వాకిట నిలిచి కణ్వుఁడు "అమ్మా శకుంతలా!" యని పిలిచెను గాని ప్రత్యుత్తరము రాలేదు. ఏమిది యని లోపలికి పోయి నలుప్రక్కలఁ జూడఁగా నొకమూల సిగ్గుచేత భయము చేత తలవంచుకొని గోడవంక తిరిగి శకుంతల నిలఁబడి యుండెను. కారణ మడిగిన చెప్పదు. అప్పుడు కణ్వుఁడు జ్ఞానదృష్టిచే జరిగిన వృత్తాంతమంతయు నెఱిఁగి "అమ్మా! నీవు చెడు కార్యము చేసినదావు గావు. ఏల నీవు భయపడెదవు? రమ్ము" అని చేర బిలిచెను. శకుంతల కొంచెము ధైర్యము తెచ్చుకొని ఆయన పాదములను కడిగి తెచ్చిన పదార్థముల నందుకొని పదిలపఱిచి యాయన విశ్రమింపఁగా సమీపమున నిలిచి చేతులు మోడ్చి యిట్లనెను. "తండ్రీ! పుట్టినింట నుండువఱకు కన్యకలకు తండ్రి రక్షకుఁడు. అట్టి తండ్రికి చెప్పకయే నేను బాల్యచాపల్యమున నొక యకార్యము చేసితిని. దయావంతులు మహాత్ములు

నగుట మీరు దానిని సహించితిరనంటిరి. ఆ మాట నేను విశ్వసింపవచ్చును గదా? నా ధైర్యమునకై నేను అడుగుచున్నాను గాని మీ మాటయందు సంశయము కలిగి గాదు" అని సవినయముగ మెల్లగ నేలఁ జూచుచు అడిగెను.

కణ్వుఁడు :

గీ. **"తల్లి నీ కులగోత్ర సౌందర్యములకుఁ**
**దగిన పతిఁ గంటి; దానికిఁ దగఁగ గర్భ**
**మయ్యె; నీదు గర్భమున వాఁ డఖిలభువన**
**వహ మహనీయుఁడగు చక్రవర్తి సుమ్ము."** భార.

నీవు చేసినది అకార్యము గాదు. మంచి కార్యము. నీవు చేసిన కార్యము నేను సహించుటే కాదు. సంతోషించితిని. పొగచేత కన్నులు మూసికొని వేసినను ఆహుతి యిట్టట్టు పడక అగ్నియందే పడెను. మంచి శిష్యునకు విద్యాదానము చేసిన గురువు వలె నేనును పరమానందము నొందితిని. అరణియందు అగ్నివలె నీ గర్భమందు చక్రవర్తి కాఁగలవాఁ డున్నాఁడు. నీకు కావలసిన వరము కోరుము. ప్రీతిపూర్వకముగ నిచ్చెదను" అని చెప్పెను.

ఆ మాటలచే శంకుతల దేహ ముప్పొంగుచుండ సంతోష మణఁచుకొని తన పెనిమిటి హితము కోరి "తండ్రీ! నా భర్తవంశమునఁ బుట్టిన పౌరవులకు రాజ్యహాని లేకుండ వరమిమ్ము" అని వేఁడెను. కణ్వమునియు అట్లే యిచ్చితినని చెప్పెను.

## భరతుని జననము

తరువాత మూఁడు సంవత్సరములు గర్భము ధరించి శకుంతల యొక్క కుమారు సూర్యునివంటి తేజము గలవానిని చేతుల యందు చక్రచిహ్నములు గలవానిని గనియెను. వానికి జాతకర్మము మొదలైనవి కణ్వుఁడే నిర్వర్తించెను. ఆ బాలుఁడు ఆఱువర్షముల ప్రాయమునందే వనమృగముల నెల్లఁబట్టి చెట్లకు కట్టుచు, నేనుఁగులు రొదలు సేయ వానిని తొండములఁబట్టి యీడ్చుచు, సింహములపఱ నెక్కి యాడుచు, తల్లి పాలు ద్రావు పులిపిల్లలఁ జెవులు పట్టి లాగుచు, అద్భుతమైన బలముగలవాఁడై వెలుఁగుచున్న యతనికి మునులెల్ల సర్వదమనుఁడని పేరు పెట్టిరి.





యిట్లు యౌవరాజ్యభారము వహింపశక్తి గల బాలకుని జూచి యొకనాఁటి వేకువ కణ్వుఁడు తనలోఁ దానిట్లు చింతించెను. దుష్యంతుఁడు శకుంతలను వివాహమాడి చాలఁ గాలమయ్యెను. కుశలవార్తయైన నంపకున్నవాఁడు. రాజులు అనేక కార్యముల చింతలలో మునుఁగుదురు. కావున మఱచెనో నాకు వెఱచెనో. ఆయన తన భార్యను బిలిపించుకొనఁ డయ్యెనని చాలఁ గాలమునే నీ కుమారి నిందుంచుకొనుట దగదు. కులసతికి భర్త యెట్టివాఁడైనను అతని విడిచి పుట్టినింట నుండుట సంతోషకారణము కానేరదు. శశిని నెడఁబాసిన కలువ వికసించి యుండఁగలదా? కావున భార్యాభర్తల సౌఖ్యముఁ గోరి పుత్రికను భర్తకడకుఁ బొమ్మందునా? నేనేమని యీ బిడ్డ నెడబాసి యుండఁగలవాఁడ? ఈ శకుంతల భర్తృగృహమునకు బోవునది గదా యని తలఁచి నప్పుడంతయు హృదయమున తహ తహ పొడమును. కంఠమునంద యణఁపబడు చున్న కన్నీళ్లచే డగ్గుత్తిక కలుగును. నేత్రాదులు తమ తమ వ్యాపారంబులఁ బ్రవర్తింపకుండును. అయ్యో! వైరాగ్యము గలవారమై తపము సలుపుచు సుఖదుఃఖసములమై యరణ్యవాసులమగుమాకు యిది యింతటి దుఃక కారణమగుచుండఁగా క్రొత్తగ పుత్రికల విడిచియుండు గృహస్థు లే కరణిని ఈ శోకము వహింతురో కదా. అయినను కర్తవ్యము మానరాదని తలఁచి శకుంతలనుజేరఁ బిలిచి "అమ్మా! శకుంతలా!

కం. **వల్లభుని విడిచి చిరముగఁ**
**దల్లీ! పుట్టింట సతికిఁ దగదు వసింపన్**
**బొల్లువడుఁ జుమ్ము ధర్మము**
**సల్లలితయశంబు విమలచారిత్రంబున్.**

చం. **చిరముగఁ దండ్రియింట నివసించుట, స్వేచ్ఛఁ**
**జరించుటల్, సదా। పురుషుల గోష్ఠి, పుంశ్చలుల**
**పొత్తును, యాత్రల నుత్సవంబులన్ । దిరుగుట**
**వృత్తసంచ్యుతి, విదేశనివాసము, వృద్ధభర్తయున్ !**

**బొరుగిరుగిండ్లఁ గ్రుమ్మరుట పొల్తుకనాశము నొంద హేతువుల్** అని నీతి శాస్త్రము చెప్పుచున్నది.

"శాస్త్ర మతిక్రమించువారికి ఒకటఁగాకున్న మఱియొకట, ఒకచోటఁ గాకున్న మఱియొకచోట, ఒకవేళఁ గాకున్న మఱియొక వేళ తప్పక కీడు కలుగును కావున నీతి తెలిసిన మతిమంతులు శాస్త్రమును అలక్ష్యము చేయరాదు. శాస్త్రము నూర్వురు తల్లిదండ్రుల ప్రేమగలదని ప్రమాణము. కావున నిన్ను భర్త కడకు పంప నిశ్చయించితినని శార్ఙ్గరవుఁడు శారద్వతుఁడు అను శిష్యులఁ బిలిచి రేపటి వేకువజామున లేచి మీరు శకుంతలను గుమారుతోడ హస్తినాపురము నకుఁ దోడ్కొని పోయి దుష్యంతు నొద్ద విడిచి రావలయునని" చెప్పెను.

## శకుంతల హస్తినాపురమునకుఁ బ్రయాణమగుట

ఉదయమునకు మున్న ప్రయాణమునకు వలయు ప్రయత్నము లన్నియు జరగెను. ఋషి తన తపోమహిమచే దివ్యమైన చీరలు సొమ్ములు సృష్టించి యాఁడుబిడ్డకు నిచ్చెను. వానితో ఆమె సఖులామెను అలంకరించిరి. రాఁగల రాజ్యలక్ష్మిచే నీమె యిట్లు శోభిల్లఁగలదని యవి సూచించునట్లుండెను. కణ్వుఁడు కొమార్తెకు ఒడిబియ్యము పెట్టి వస్త్రయుగ్మము నిచ్చెను. శకుంతలయును అందున్న తాపస స్త్రీలకును వృద్ధులకును తండ్రికిని ఇలువేల్పులకును సిగ్గుతోడను చిఱునవ్వుతోడను భక్తితోడను మ్రొక్కి వారిచే దీవనలను అనుజ్ఞలను పడసెను. అంత శార్ఙ్గరవుండు మున్నుగఁ జనుచు మార్గంబు చూపనందఱు తపోవనము త్రోవన పోవుచుండిరి. అప్పుడు కణ్వుఁడు వ్యసనముతో చెట్టులను తీఁగలనుజూచి,

**చ. తొలుతను మీకుఁ బోయకయె తోయము త్రావ**
**దొ యేమె సొమ్ములం। గలిగియు రక్తి మీయెడలఁ**
**గల్గిన ప్రీతి నన౯ ధరింపదో। తొలికుసుమ ప్రసూతి**
**కినె తొరము పొంగునొ యల్ల యీ శకు। తల పతి**
**యింటి కేగెడి లతాతరులార! యనుజ్ఞ యీయరే.**

అని బిగ్గఱ పలికెను.

ఆమె మంచితనమువలనను ఆమె యందలి ప్రీతిచేతను వనమునందలి వృక్షము లామెకు ఎండసోఁకకుండ నీడలు కప్పుచుండెను. భూమి కఠినత్వము చేత పదములు నొవ్వకుండునట్లు ఆకులు రాల్చుచుండెను. మెల్లని కమ్మని







చెలులు శకుంతలను శృంగారించుట

గాలి వీచుచుండెను. మార్గమునందలి కొలఁకులెల్ల చల్లని నీటిచేతను విరిసిన తామరల చేతను ప్రకాశించుచుండెను. ఆమె తమ్ము విడిచి పోవుచున్నదను దుఃఖముచే సగము కొఱికిన లేఁత దర్భలు నోట నుండి తమంత జాఱుచుండఁ గాఱెడి కన్నీటితో నామెవెంట జింకలు పోవుచుండెను. నెమిళ్ళు లాట చాలించెను. లతికలు కన్నీరు గార్చునట్టు పూరసము కార్చెను. పతియొద్దకుఁ బోవుచున్నా నను సంతోషము కలిగిన దయ్యు శకుంతల తన తోడివారు తన వియోగము సహింపలేక పడు దుఃకము చూచి తానును మిగుల సంతాపించెను.

ఇట్లు కొన్ని యడుగులు నడచి యచ్చటఁ దాను పెంచి తియ్య మామిడి కల్లించిన జాజితీఁగ యద్దకుఁ బోయి నిలఁబడఁగా అది తీఁగెలచే ఆమెను చుట్టుకొనెను. దానిని జూచి శకుంతల "సోదరీ మాలతీ! ప్రియము గల మావితోఁ గూడియు కొమ్మలను చేతులచే నన్నుఁ గౌగిలించితివి. నేను నేఁడు మొదలు దూరదేశమున నుందును. నన్ను మఱవకుమా!" అని చెప్పి తండ్రిని జూచి

"నాయనా! యీ మాలతిని నాతోసమానముగఁ బెంచితిని. ఇఁక నెట్లు చూచెదవో" యనఁగా ఆయన "అమ్మా నీకుఁ దగిన పెనిమిటి నీకు కలిగిన తోడనేయాలోచించి దీనిని తియ్య మామిడి కల్లించితిని. నీ యెడఁబాటు వలనఁ గలుగు దుఃకము దీనిని జూచి పాపుకొనువాఁడ. అదే చూడుము నీవు చిన్నప్పటినుండి సాఁకిన తల్లిలేని జింక పిల్ల. సూదివంటి దర్భమొనలు మొగమునఁ గ్రుచ్చుకొనఁగా బాధపడుచు ఆహారము తినలేనప్పుడు నీవు దేనిని తొడమీఁద కూర్చుండఁ బెట్టుకొని చామలు చేతఁగొని నోట నుంచుచు సాఁకితివో యదే యది. అది నిన్ను విడిచి యుండలేక నీ వెంటనే వచ్చుచున్నది అనిన శకుంతల తిరిగి చూచి దానిని దగ్గఱ తీసి వెన్ను దువ్వి మొగమెత్తి ముద్దు పెట్టుకొని "వత్సా! సహవాసుల విడిచి పోవు నా వెంట నీవేల వచ్చెదవు. బాల్యమునంద నిన్నుఁ దల్లి విడువ బ్రతికితివఁట. ఇప్పుడు నేను లేకున్నను తండ్రి నిన్ను ఉపేక్షింపఁడు. నీవు చాల దవ్వు వచ్చితివి. నా పాదములు నొచ్చును. నిలువుము" అని నిలిపి పయనింపఁగా ఆమె సంతాప మెఱిఁగి "అమ్మా! శకుంతలా! పుట్టుచుండు కన్నీరు నేలరాలిన అపశకునమని ఱెప్పలెత్తి మీఁదు చూచుచుఁ నడచుచున్నావు. నిబ్బరించుకొని త్రోవ చూచి నడువుము. సాగనంపువారు ఉదకము దాఁటి పోరాదు. ఇదే కొలను చేరితిమి. ఇఁక నేను నీ వెంట రారాదు" అని శిష్యునిఁ జూచి,

"శార్ఙ్గరవా! నీవు దుష్యంతునితో సంయమధనులమైన మమ్మును నీ యుత్తమకులమును బంధువులకు కూడఁ దెలియనీయక యీమె నీ యందుంచిన స్నేహప్రవృత్తియు చక్కఁగ నాలోచింపుము. నీ దారల నెల్ల నెట్టి గౌరవముతో నీవు చూతువో యట్టి గౌరవముతోనే యీమెను జూడుము. తక్కినవి దైవవశములు. వానినెల్ల వధూబంధువు లగువారు చెప్పవలసినవి కావు అని చెప్పుము" అని చెప్పి శకుంతలను జూచి శకుంతలా!

శకుం : తండ్రీ! ఏమి?

కణ్వు : నీవు బుద్ధిమంతురాలవు. నీకు నేనేమి చెప్పవలసి యున్నదైనను నా మాటలు మఱవక జ్ఞప్తియందుంచుకొని ప్రవర్తింపుము. మేము వనమునందున్నను లౌకికజ్ఞులము.





**చ.** **కులముఁ దలంప మీ, గురులఁ గొల్వుమి, శీలము**
**మర్వఁబోకుమీ । యెలమిని సేవకావళుల నెప్పుడుఁ**
**బ్రోవు దయార్ద్రచిత్తవై । కలహము పొంతఁ బోవ**
**కుము, కాంతుఁ దవజ్ఞ నొనర్చె నేనియున్ । దెలి**
**యనిదానవై మెలఁగి తెమ్ము యశంబును మాకు వారికిన్.**

**చ.** **లలనరో। యాఁడు జన్మముఁ దలంపుములేయరఁ**
**టాకుపోలికన్। మెలఁకువతోఁ జరింపు, మెఱ**
**మెచ్చుల కేపనిఁ జేయఁబోకుమీ। నిలుపుమి పేరు**
**పెం, పెవరు నిన్నెటు వ్రేలను జూపకుండఁగా**
**మెలఁగు సమానలందుఁ గడు మిన్నవయ్యె గుణపాళిఁ బుత్రికా.**

**కం.** **ఎట్టి దశయందు నున్నం**
**బట్టీ! దైవంబు సతికిఁ బ్రాణేశ్వరుఁడే**
**యిట్టట్టు లాడ కతనిన్**
**నెట్టన విభు సౌఖ్యమెంచు నీ సౌఖ్యముగన్**

శకుం : తండ్రీ! మీరు చెప్పినట్లు నడుచుకొనెదను. మఱి మేలుకోరని ప్రేమతో తన్ను సాఁకి సంతరించిన తల్లిదండ్రులకు గుణము లేమిచేతనో బుద్ధి లేమిచేతనో అపకీర్తి తెచ్చునది విషపుగడ్డ కాని ఆఁడుబిడ్డ కాదు అని నా యభిప్రాయము. నా వలన మీకు లోకనింద వచ్చునని భయపడవలదు. తండ్రీ! చందన వృక్షము నుండి పడిపోయిన చందన లత వలె నే నెట్లు మిమ్ము విడిచి సంతోషింపఁగలదానను?

కణ్వుఁడు : అమ్మా! యేల యిట్లు వ్యాకుల పడెదవు?

**మ.** **తనయా! యుత్తమవంశజాతుఁ డగుత్వ త్ప్రాణేశు**
**నిల్లాలవై। చనవారన్ గృహకృత్యధర్మముల నాస్థన్**
**నీవు వృద్ధాజ్ఞలన్ । బొనరింపన్ బతిపుత్ర బంధు**
**యుతవై పోవన్ దినంబంతయున్ । జనకుం బాసిన**
**చింత యేమిటికి వత్సా। నిన్నుఁ బీడించెడిన్.**

**కం.** **గురువులఁ బతినుతబంధూ**
**త్కరముల నతిథులను నరసి తగ గృహకార్యా**
**చరణ మొనర్చిన జనకుని**
**స్మరియింపఁగ నైన నీకు సమయం బున్నే?**

శకుం : నాయనా! నిన్నును ఈ తపోవనమును మరలఁ జూచుటెన్నఁడో కదా.

కణ్వు : అదే మట్టు లనెదవు?

**కం.** **పతితోడ భూభరంబును**
**ధృతిమై భరియించి సుతుని బృథివీపతి స**
**మ్మతిఁ జేసి తపము సలుపఁగఁ**
**బతితోఁ జనుదెంచి యిందె వసియింపు సుతా!**

శార్ఙ్ల : భగవంతుఁడా! ఈమె యిట్టి ప్రశ్నములే సాయంకాలము వఱకు వేయుచుండును. ఇది యాఁడువారికి సహజము. మీకును ఆహ్నికములకు సమయము దప్పును. ఎండయెక్కిన మాకును ద్రోవ నడచుట సుఖముగాదు. అక్కా! శకుంతలా! నీ ప్రశ్నలు చాలించి తండ్రిగారికి నమస్కరించి నిలువఁగా కణ్వుఁడు "పుత్రీ ఇఁక ఆలసింపకుము. పోయిరమ్మ. మేలు గలుగుఁ గాక" అని పంపి వారు చూపుమేర దూరము పోవువఱకుఁ జూచుచుండి "ఇల్లడ సొమ్ము అఁడు బిడ్డ ఇవి యెప్పటికి అన్యుల సొత్తులే. ఈ బిడ్డను భర్తకడకుఁ బనుచుటచే నా మనంబు భారము దొలఁగి సుఖముగా నున్నది" అనుకొనుచు నింటికిఁ బోయెను.

## దుష్యంతుఁడు శకుంతలను నిరాకరించుట

కణ్వశిష్యులు శకుంతల తోడను బాలకుని తోడను హస్తిపురిఁ జేరి రాజు సభయందుండుట యెఱిఁగి రాజు నాజ్ఞచే సభఁ జొచ్చి రాజు నమస్కరింప నాశీర్వదించిరి. దుష్యంతుఁడును కణ్వాశ్రమమున నుండి వచ్చిన మీ ఋషుల నడుమ ముసుఁగు వేసికొని ముదురు టాకుల నడుమ నుండు చిగురువలె లావణ్యమెఱుక పడనీయకుండు స్త్రీ యెవ్వతెయో? ఈ బాలుఁ డెవ్వఁడో?





కొడుకు తోడి శకుంతలగా నుండునా? అట్లైన నే నిప్పుడేమి చేయవలయు నని యాలోచించుచు నేమియుఁ దెలియని వానివలె ముఖమున బిగువు తప్పనీయక యూరకుండెను.



కణ్వుఁడు శకుంతలను ఆశీర్వదించుట

శకుంతల దుష్యంతునందు ప్రీతిగుర్తు లేమియుఁ గానక,

**కం.** **"ఎఱుఁగఁడొకొ? నన్ను నెఱిఁగియు**
**నెఱుఁగని యట్లుండు నొక్కొ? యెడదవ్వగుటన్**
**మఱచెనొకొ? ముగ్ధ లధిపులు**
**మఱవరె బహుకార్యభార మగ్నులు కారే"** భార.

**చ.** **తలఁపఁగ నాఁడు పల్కిన విధం బెడఁ దప్పఁగఁ**
**జూచెనొక్కొ? చూ। ద్కులు విరసంబులై కరము**
**క్రూరములైన నిమిత్త మేమొకో?। కలయఁగఁ బల్క**
**రించి రుపకారులు నైరని నమ్మియుండఁగా। వల**
**వదు బుద్ధిమంతులు నవప్రియులైన ధరాధినాథులన్.** భార.

అని యాలోచించుచు నిలఁబడి యుండెను.

రాజు మునులఁ జూచి "మునీంద్రులారా! మీకు తపంబులు విఘ్నములు లేక సాగుచున్నవా?" అని యడిగెను.

మునులు : సూర్యుఁడు ప్రకాశించుచుండఁ జీఁకటి బాధ లోకమునకుఁ గలుగునా?

రాజు : నాకు రాజు అను శబ్దము నేఁడు సార్థకము. లోకము ననుగ్రహింప కణ్వులు కుశలులు గదా.

మునులు : వారు స్వాధీనకుశలులు. మీ యోగ క్షేమములు విచారించి యిట్లు వారు చెప్పుఁ డనిరి.

రాజు : ఏమి యాజ్ఞాపించిరి?

మునులు : "పూజ్యులందు నీవు ముఖ్యుఁడవు. ఈ నా కూఁతురు శకుంతల ఆ కారముగొనిన పూజ్యత. ఇట్టి మీకు దాంపత్యముఁ గూర్చి బ్రహ్మలోకమున నింద దొలఁగించుకొనెను. పుత్రవతి యగు నీమెను ధర్మము నీతోడ నడవు నిమిత్తము గ్రహించునది" అని,

రాజు : ఏమి మీ రుపన్యసించునది?

మునులు : నీవును ఈ శకుంతలయు బంధువుల కెవ్వరికిఁ జెప్పక రహస్యముగ కణ్వాశ్రమమున చేసిన ప్రమాణపూర్వకమైన స్నేహము గుఱించి,

రాజు : ఆ స్త్రీని సభ కేల తెచ్చితిరి?

మును : ఈమెయే శకుంతల. నీ భార్య. వీఁడు నీ కొడుకు. ఎట్టి పతివ్రతయైనను దీర్ఘకాలము పతిని విడిచి యుండరాదు. ఉండినచో లోకనిందకు పాలుపడును. కావున భర్తకు ప్రియురాలైనను అప్రియురాలైనను స్త్రీని భర్తయొద్దకే పంపుట ఆమె బంధువుల విధి.

రాజు : మీరు చెప్పునది నాకేమియుఁ దెలియదు. ఈ స్త్రీ మొగమే నే నిది వఱకుఁ జూడలేదు.

శార్ఙ్గ : శకుంతలా! నీ ముసుఁగు దీసి ముఖము చూపుము. అప్పుడైన నీ మగఁడు నిన్ను గుర్తింపఁ గలుగును.





అని చెప్పఁగా శకుంతల ముఖము మీఁది ముసుఁగు తీసెను. మబ్బు విడిచి ప్రకాశించు చంద్రబింబము వంటి శకుంతల ముఖముచూచి చక్కఁగ గురించియు "ఆహా నా గతి మంచుకప్పిన మొల్లపూవును అనుభవింపలేక విడువలేక మిణకరించు తుమ్మెదవలె నున్నది. లోక నిందవలన భయముచే నీ భార్యను పరిగ్రహింపను లేను. అధర్మమగునను భయమును విడువను లేను. కామమునకు లోపడి లోకాపవాదమునకు పాలుపడరాదు. అపకీర్తికి వెఱచి ధర్మపత్నిని విడిచితినా ధర్మమునకు హాని. ధర్మహానికి వెఱచి గ్రహించితినా సత్య మెఱుఁగని లోకము నన్ను తప్పు త్రోవ చూపినవానివలె నెంచి యదియు నటులే ప్రవర్తింప యత్నించును. భార్యను విడిచిన పాపము వచ్చిన నేనొక్కఁడనే చెడిపోవువాఁడను. దీని నేను గ్రహించితినా లోకమంతయుఁ జెడును. ఆ దోషమంతయు నన్నే కదా బాధించును. అటుపోయిన నూయి యిటు పోయిన గోయి. ఏమి చేయవచ్చును. కానీ చూత'మని తనలోఁ దా నాలోచించి మునికుమారులారా! నేనెంత ప్రయత్నించినను ఈ సతి మొగము చూచినట్టు నాకు స్మృతికి రాలేదు.

శార్ఙ్గ : నీకు చంద్రబింబము చూచి స్మృతి కలదా?

శార : ఈయనకు స్మృతి లేదు. మతి లేదు. శ్రుతి లేదు.

శార్ఙ్గ : ఏమి రాజా! నీవు మనసారఁ జేసిన కార్యమందే నీకు ద్వేషబుద్ధి పుట్టెనా? ధర్మము పట్ల విముఖుఁడ వైతివా? అసత్యము నీకుఁ బ్రియమయ్యెనా?

రాజు : నిష్ఠురము లేల యాడెదరు?

శారద్వతుఁడు : శార్ఙ్గరవా! మనస్సెఱిఁగి కాదు. ఐశ్వర్యముచే మదించినవారికి, అధికారమను పిశాచము పట్టినవారికి నిట్టి వికారములు విశేషముగ నుండును.

రాజు : ఇది వాఁత మీఁద కోఁత.

శార్ఙ్గ : నీ చేఁత మిగుల రోఁత.

రాజు : మునికుమారులారా! పరుషవాక్యముల వలన ఫలము గలదా? వీథిని బోవు నొక్కొక్క స్త్రీ 'నేను నీ భార్యను నన్నుఁ బరిగ్రహింపు'మనిన ధర్మ మాలోచింపక నేను బరిగ్రహింపవలయునా?

శార్ఙ్గ : రాజా! నీ వీ విషయంబున ధర్మహాని లేకుండఁ బ్రవర్తించుచున్నానని తలఁచితివా? వినుము. భార్య భర్తవ్య యను ధర్మమునకు హానియు నవమానము గలిగించితివి. నీకు ఈమెయందుఁ గలుగు కుమారుని యువరాజు జేసెదనని నీవు ప్రమాణము చేసి తప్పుటచే సత్యమునకు హానియు నవమానము గలిగించితివి. పతివ్రతయగు భార్యను ఈలువు లేనిదానిగ నెంచుటచే పతివ్రతమును ధర్మపత్నిని నవమానించితివి. భగవవంతుఁడగు కణ్వుని నీ వసత్యమాడువానిగను మోసగానిగను ఎంచుటచే నీవు గురువునకు ద్రోహము చేసిన వాఁడవైతివి. వీథిని బోవు ఱాఁగలను నీకుఁ దార్చువారిఁగ మమ్మెంచుటచే మా కవమానము గలిగించితివి. నీకు స్మృతియును మతియును వాస్తవముగ లేవాయెనా నీవు రాజుగ నుండఁదగవు. స్మృతి యుండియు మమ్ము వంచించెదవా మిక్కిలి నీచుఁడవగుట యెంతటి శిక్షకైన నర్హుఁడవు. మమ్ము మా గురువులను అవమానించినందునకై నీ రాజ్యము పరుల పాలగునట్లు శపించెదను చూడుము.

శార : వీఁడు రాజ్యము ప్రాణము గూడఁ గోలుపోవలసివాఁడే. వీఁడు భస్మము కాఁదగియున్నాఁడు.

అనిన శకుంతల గడగడ వడఁకుచు ముని కుమారులను జూచి “అన్నలారా! మీ రీ రాజుగారిని నా నిమిత్తమై శపింపవలదు. వివాహమైన దినమందే పౌరవులకెల్ల రాజ్యహాని లేకుండ తండ్రిగారివలన నేను వరమును బొందితినని మీ రెఱుఁగరా? దానికి విరోధముగ మీరు శపింపవచ్చునా? నా పతిని శాపాగ్నిచే కాల్చితిరా నా కెంత మీరు హాని కలిగించినవారగుదురో ఆలోచింపుఁడు” అనెను.

ఆ మాటలు విని తనలోన మెచ్చుకొనుచు “స్త్రీలు ప్రత్యుత్పన్న మతులు గదా” యని వారితో పలికెను.

శారద్వతుఁ డా మాటలు విని “శకుంతలా! నీ మాటల శాంతము వహించితిమి. ఇంటఁ బెద్ద లున్నవారని యాలోచింపక స్వతంత్రు రాలవై చూపుచేతనే రూపము నీటులకు తియ్యనిమాటలకు ధనము మూటలకు





మోసపోయి కండ పొగరునఁ జేసిన కార్యమున ఫల మనుభవింపుము. స్నేహ మనునది మునుమున్నచక్కఁగ విచారించి చేయఁదగినది. అందు రహస్యముగఁ జేయు స్నేహమునకు నెక్కువ యాలోచన వలయును. వ్యవహారము లెఱుంగని వారియం దీ విధముగ స్నేహము విరోధ కారణమగును. మేము చెప్పఁదగినది చెప్పవలసినది అంతయుఁ జెప్పితిమి. ఇఁక నీ యిష్టము నీ మగని యిష్టము” అని చెప్పఁగా శకుంతల చాల కళవళించి యట్టి యనురాగమే యిట్టి మాఱుపాటు పొందెనఁట. నేనేమి చెప్పిన నేమి ప్రయోజనము. కానీ వచ్చి యూరక పోరాదు కదా యని నిశ్చయించుకొని రాజును చూచి,

## శకుంతలా దుష్యంత సంవాదము

“ప్రాణేశ్వరా! కణ్వాశ్రమమున నాఁటి నెయ్యము మఱచి యిప్పు డిట్లు పలుకుట మీ యట్టివారికిఁ దగునా?

స్వభావము చేతనే యుదార హృదయులమై కల్లకపటము లెఱుఁగని మమ్ము ఆశ్రమమున, ప్రమాణములు వచించి నమ్మించి యిచ్చుట వంచించుట పౌరవునకు నర్హమా” యనెను.

రాజు : ఓసీ! నన్నేల నీవు ప్రాణేశ్వరా యని సంబోధించెదవు. నీ వగలమారి పలుకులను నీ తళుకుబెళుకులను కులుకులకు మేము మోసపోవఁ గామదానులము గాము. తీరమున తీరమునందలి వృక్షములను గూడ నురులఁ ద్రోయు కూలంకషవలె నున్నదానవు. నీ రాక మాకును మా సభ్యులకును హానికరముగఁ దోఁచుచున్నది.

శకుం : పాము కాటు చేలచెఱఁగునఁ దుడిచిన పోదు. భార్యాభర్తల సంబంధము “నీవు నాకు భార్యవు కావు. నేను నీకు భర్తను గాను” అనపి నంతనె పోదు. ఆలోచన లేక మీ రామాట చెప్పుచున్నారు. నన్ను కూలంకషగ భావింపకుఁడు. మిమ్మును మీ వంశంబు నుద్ధరింపఁ జేయ వచ్చిన పావనియగు దేవనదిగఁ దలఁపుఁడు.

రాజు :

కం. వెవ్వతె వే నెవ్వఁడ
నీ వెందలిదాన వెఱుఁగ నే నీ మొగముఁ
నావులు దిద్దఁగ వచ్చితె
నీ వచ్చిన త్రోవఁ బొమ్ము నిలువకు మిచటఁ.

కం. "వనకన్యక నఁట నేనఁట
వనమున గాంధర్వమున వివాహం బఁట నం
దనుఁ గనెనఁట మఱచితినఁట
వినఁగూడునె యిట్టిభంగి విపరీతోక్తుల్.

అనిన శకుంతల చాల విషాదపడి యిట్లనియె. రాజేంద్రా! మీరు తొమ్మిది సంవత్సరములనాఁడు కణ్వాశ్రమము సమీపమున నుండు వనములకై వేఁట నిమిత్తముగ పోయితిరా?

రాజు : పోయతిని.

శకుం : అప్పుడు మీరొక జింకను దఱుముకొని పోయితిరా?

రాజు : పోయితిని.

శకుం : దానిని మీరు చంపితిరా?

రాజు : లేదు.

శకుం : ఏల చంపలేదు?

రాజు : ఋషికుమారు లిరువురు వచ్చి ఆశ్రమమృగమని చెప్పిరి.

శకుం : ఎవరి ఆశ్రమమృగమని చెప్పిరి?

రాజు : కణ్వాశ్రమ మృగమని చెప్పిరి.

శకుం : ఆ ఋషికుమారు లిరువురు ఈ శార్ఙ్గరవుఁడు శారద్వతుఁడే యగుదురేమో గుర్తింపఁగలరా?

రాజు : ఉండిన నుండవచ్చును.

శకుం : మీకు గుర్తు లేకున్న మీ సారథి నడిగెదరా?

రాజు : అక్కఱ లేదు. వీరే యైయుందురు. చూచిన జ్ఞప్తి యున్నది.





శకుం : కణ్వమహాముని దర్శనము చేసికొని పోయెదనని వీరితో మీ సారథి వినుచుండఁ జెప్పితిరా?

రాజు : చెప్పితిని.

శకుం : ఈ ఋషిపుత్రుల మిమ్ము నేమనియైన దీవించిరా? ఊరక నిర్లక్ష్యముగ పోయిరా?

రాజు : మీకు శీఘ్రముగఁ జక్రవర్తియగు పుత్రుఁ డుదయించును గాక యని దీవించిరి.

శకుం : మునుల వారి దర్శనము చేయుటకై సారథిని తేరిని విడిచి వారి ఉటజమునకు మీరు పోయితిరా?

రాజు : పోయితిని.

శకుం : మునులవారిని దర్శించితిరా?

రాజు : లేదు.

శకుం : ఏల?

రాజు : వా రుటజమున లేకుండిరి.

శకుం : అది మీకెట్లు తెలిసెను?

రాజు : విచారించితిని.

శకుం : ఎవరిని విచారించితిరి? ఎవరు మీకు చెప్పిరి?

రాజు : నా కెవ్వరును చెప్పలేదు. నేను పిలిచిన నెవ్వరు ప్రత్యుత్తర మీయలేదు. నేను మరలి వచ్చితిని.

శకుం : విచారించితి నంటిరే ఎవరిని?

రాజు : విచారించితి ననఁగా ఆలోచన చేసితినని యర్థము.

శకుం : ఉటజమునం దతిథుల సత్కరింప నెవ్వరుండునది వీరు మీకుఁ జెప్పలేదా?

రాజు : ముని కూఁతురున్నదని చెప్పిరి.

శకుం : ఆమె మిమ్ము సత్కరించెనా?

రాజు : నేను పోయినప్పు డామె యింట లేదు.

శకుం : మీ మాట మీరు మీఱుచు శకుంతల తండ్రి యాజ్ఞ మీఱిపోయిన దని చెప్ప సాహసించితిరా? ఇంతవఱకు సారథి సాక్ష్యము గలదని నిజము చెప్పితిరి. ఇప్పుడు అసత్యమాడఁ బ్రారంభించితిరి. కల్లదాఁగదు సుఁడీ. మీరు పిలువఁగానే యెవ్వరు పలుకలేనదని వెంటనే మరలితిరా? కొంతసేపు నిలిచితిరా? ఈ విళంబునకు సారథి సాక్ష్యము గలదు. అసత్యమాడకుఁడు.

రాజు : కొంతసేపు నిలిచితిని.

శకుం : ఎచట? ఇంటికి వెలుపలనా లోపలనా?

రాజు : కొంతసేపు వెలుపల నుండి లోపల నెవరైన నున్నారేమో చూతమని లోపలికి పోయితిని.

శకుం : అప్పుడు మీరెవరితోనైన మాటలాడితిరా?

రాజు : నాకు జ్ఞప్తి లేదు.

శకుం : ఎవరినైన చూచిన జ్ఞప్తియున్నదా?

రాజు : దీర్ఘకాలమైనది జ్ఞప్తి లేదు.

శకుం : ఋషుల దీవనలు గాని తిట్లుగాని వెంటనే ఫలించునని మీకు నమ్మకము గలదా?

రాజు : కలదు.

శకుం : ఋషికుమారుల దీవన లెంత త్వరగా ఫలించుకాలము వచ్చెనని మీ రనుకొంటిరా?

రాజు : ఏమనుకొంటినో స్మరణమునకు రాలేదు.

శకుం : ఋషికుమారుల దీవనలు ఫలించెనని కాని ఫలింపకపోయెనని కాని తలఁచుటకు గారణము కలిగెనా?

రాజు : నా కిప్పుడు స్ఫురింపలేదు.





శకుం : మా తండ్రిగారి దర్శనము చేసి పోవలయునని వచ్చినవారు వారు వచ్చు వఱకుండక వెంటనే పోవుటకు అచ్చట వారికి కోపము వచ్చునట్టి కార్యము మీరు చేసితిరా?

రాజు : నేను జేయలేదు.

శకుం : వారికి కోపము వచ్చునేమో యని మీకు సందేహము కలిగింపఁ జాలుపని యైనఁ చేసితిరా?

రాజు : ఏమో చెప్పఁజాలను?

శకుం : ఇష్టము లేకున్న పోనిండు. వీనియందు జక్రవర్తి చిహ్నము లున్నవేమో చూచెదరా?

రాజు : ఉండిన నుండనిమ్ము. ఆ మాత్రము చేతనే వాఁడు నా కొడుకని యెట్లు సిద్ధాంతము?

శకుం : సింహము సింహమునకుఁగాక గ్రామసింహమునకుఁ బుట్టునా?

రాజు : పుట్టదు.

శకుం : ఈ బాలుని మొక్కట్లు మిమ్ముఁ బోలియున్నవేమో పోలిచి చూచెదరా?

రాజు : లోకమున నందఱు బిడ్డలయందు తండ్రి మొక్కట్లే కలవా?

శకుం : ఇన్ని విషయములు జ్ఞప్తి యందుంచుకొనిన మీకు మీ రచ్చట నెవ్వరితో మాటలాడితిరో అది యత్యంత ముఖ్యమయ్యు మఱపురానిదయ్యు మఱచితిననుచున్నారు. నా దురదృష్టమే మీకు మతిహాని కలిగించెఁ గాఁబోలు. అదాటున చూచి ఈ ఋషి కుమారులను మీరు గుర్తింపఁ గలిగితిరి. మూఁడు గంటలకాలము నాతో నుండియు నన్ను గుర్తింపలేననుచున్నారు. ఆ యుటజము వాకిట మీరు నిలిచి ప్రశ్నించినప్పుడు మీకు ప్రత్యుత్తర మిచ్చినదానను నేనుగానా? నా జన్మచరిత్రము మీకు చెప్పినదానను నేను గానా? మీరు మోహించి గాంధర్వవిధి వివాహము చేసికొనినది నన్నుఁ గాదా? నాకు పుట్టెడు కొమరునకు యౌవరాజ్య మిచ్చెదనని ప్రమాణము చేసినవారు మీరు కారా? వీఁడు నా కొమరుఁడు. మూఁడు సంవత్సరములు గర్భమున



విశ్వామిత్రుఁడు లజ్జతో శిశువు నిరాకరించుట

మోచి కంటిని. ఇప్పుడు వీనికి ఆఱు సంవత్సరముల ప్రాయము. ఇప్పుడన మీ వృత్తము స్మరించెదరా?

రాజు : నా వలన నీ వేదైన అభిజ్ఞానము గైకొంటివా?

శకుం : తాను దొంగయైన పొరుగును నమ్మఁడు. తనయందు వంచన లేని వాఁడు పరుల వంచకులని యూహింపఁజాలఁడు. తనయందున్నదే పరులయందుఁ దోఁచును. వంచన నే నెఱుఁగని కారణము చేతను, పౌరవులు వంచకులు గారను నమ్మకముతోను నేను గుర్తు యాచింపనైతిని రాజేంద్రా!

**గీ. "ఏల యెఱుక లేని యితరుల యట్ల నీ**
**వెఱుఁగ ననుచుఁ బలికె రెఱిఁగి యెఱిఁగి**
**యేనె కాని దీని నెఱుఁగ రిం దొరులని**
**తప్పఁ బలుకఁ జనునె ధార్మికులకు?"** భార.

రాజు : ధర్మమందుఁగాని, అర్థమందుఁగాని కామమందుఁగాని నీకు నాకు సంబంధమున్నట్లునేను స్మరింపఁజాల? నీ వెవ్వతవో నే నెఱుఁగ.





నీ మాట నమ్ముదమనిన నీవు స్త్రీవి. స్త్రీలు అసత్యము మాటలాడు వారలనుట జగమెఱిఁగిన విషయమే. దానికి దృష్టాంతము పది పండ్రెండు సంవత్సరముల యీడుగల యీ బాలుని ఆఱువర్షముల ప్రాయమువాఁడని నీవు చెప్పుటయే.



దుష్యంతుఁడు శకుంతలను నిరాకరించుట

శకుంతల కొంచెము కోపముతో నిట్లనియె. "పసిరికలుగల గల వానికి ప్రతి పదార్థము పచ్చగా నగపడును. మీ మనోవికారమే మీ బుద్ధిబలమును జెఱిచి యన్నియు విపరీతములుగఁ దోఁచునట్లు చేయుచున్నది.

**కం. "మఱచినఁ దలఁపింపఁగ నగు**
**నెఱిఁగిని నాఁ డెల్లపాట్ల నెరిఁగింపఁ దగుఁ**
**మఱి యెఱిఁగి యెఱుఁగనొల్లని**
**కఱటిం దెలుపంగఁ గమలగర్భునివశమే"** భార.

నిద్రపోవు వాని లేపశక్యముగాని మేలుకొన్నవాని మేల్కొలుప నెవరితరము? ఏ కారణముచేతనో మీరిట్లు మాటలాడుచున్నారు. గాని మనస్సునకుఁ దెలియక కాదు.

## శకుంతల స్త్రీగౌరవము భూషించుట

స్త్రీలందఱు అసత్యమాడువారంటిరి. స్త్రీలయందు సత్యమాడువారును పురుషులయం దసత్యమాడువారును లేరా? ఈ రెంటికి మనమే యుదాహరణము లని మీ మనస్సునకుఁ దెలియును గదా?

స్త్రీలనిన మీ కంతటి నిర్లక్ష్యభావ మేల కలిగెనో నే నూహింపఁ జాలకున్నాను. ఉత్తముఁడగు పురుషునికన్న ఉత్తమురాలగు స్త్రీ యేమిటఁ దక్కువో చెప్పుఁడు. నలదమయంతులందు, సావిత్రీ సత్యవంతులందు చంద్రమతి హరిశ్చంద్రులందు, దమయంతీ కల్మాషపాదులందున,, అరుంధతీ వసిష్ఠులందు, రోహిణీ చంద్రులందే, అనసూయాత్రులందున, సీతారాములందు, లక్ష్మీనారాయణులందు, శివాభవులందు, భాషాపితామహులందు, శచీశక్రులలందు, స్వాహాగ్నులయందు, లోపాముద్రాగస్త్యులయందు, సుకన్యాచ్యవను లందు మఱి లోకమున వేనవేలు ఆర్యదంపతులందు హెచ్చువరో లొచ్చెవరో చెప్పుఁడు. లోకమంతు స్త్రీ ప్రాయమని చదివిన చదువు మఱచితిరి. కాఁబోలు. స్త్రీని విడిచి పురుషుఁడు చేయఁగల కార్యమేది? మహాఋషులైనను దేవతలై నను స్త్రీలయందుఁ గాక తమంతఁ దామే ప్రజావృద్ధి చేయఁగలిగిరా? ఇంటియందుఁ బిచ్చము వేయు నధికారమైనఁ బురుషులనకుఁ గలదా? "భిక్షంబుఁ బెట్టరే పుణ్యసతులు". "భవతి భిక్షాం దేహి" యన్న వాక్యముల సారముఁ దలఁపవలదా? మీరు నగరములందు నాగరకత చేత దుష్టలై మట్టు మర్యాద లెఱుఁగక, సత్యాసత్యముల గౌరవింపక, కులశీలములు దలఁపక, పుణ్యాపాపము లాలోచింపక, అర్థకామములం దాసక్తిగలవారై సంచరించు ప్రతీపదర్శినులగు మిటారులనే చూచువార లగుటచేత పాపభీరువులగు శీలవతులన, సత్యవాదినులగు పుణ్య మహిళ లన నెట్టివారో మూహింపనైనఁ జాలకున్నారు. "ఇల్లు ఇల్లు కాదు. ఇల్లాలే ఇల్లు" అను వాక్యము మీరు విన్నవారలే కారు కాఁబోలు. అంగనలేని యిల్లును, చతురంగ బలములేని రాజును, శాంతముల ఏని యతియును, జనసమ్మతి లేని ప్రధానియును, వ్యర్థములన మీరు వినలేదా? దీనిని కుటుంబి యెవఁడైన, గాదునువాఁడు కలఁడా? తల్లిదండ్రులు, భార్యాభర్తలు, స్త్రీపురుషులు అను వానియందు యోగ్యతను బట్టి కదా స్త్రీ వాచకము తొలుత నిలుపఁబడినది. స్త్రీ జాతి దుష్టము గాదు. అట్లు జాతియే దుష్టమేని తెలిసి తెలిసి పురుషుఁ డేల దానికిఁ





దన సగము దేహము పంచి యియ్యవలయును? స్త్రీ జాతి దుష్టమనుట యెట్టు లనాలోచితమో అట్లు ఈ బాలుఁడు ౧౦-౧౨ సంవత్సరములవాఁడనుటయు అనాలోచితమే. పొలము విత్తనము రెండును సారవంతములై యున్నప్పుడు పుట్టెడి చెట్టువలె ఆ రెంటియం దొక టేదేని నిస్సారమై నపుడు పుట్టెడి చెట్టుండఁ జాలదని యే పొలము కాపరియైనను మీకుఁ జెప్పఁ గలఁడు. మీ రెఱిఁగి యెఱిఁగి నన్నెఱుఁగ నని యసత్యమాడుచున్నారు. ప్రభువులై గొప్పకులమునఁ బుట్టినవారలైన మీరే తెలిసి తెలిసి యసత్యమాడిన మిమ్ముఁ జక్కదిద్దు వారెవ్వరు? వెలుగే చేను మేసిన కాచువారెవరు? రాజు ఏ పోకనఁ బోవునో ప్రజలును ఆపోకనే పోవుదురు. యథా రాజా తథా ప్రజా యనుట మఱవకుఁడు. మీరే యసత్యమాడ భయపడరేని లోకము వారెట్టు వర్తింతురో దాని ఫలమెవ్వరిని చెందునో యాలోచింపవలదా? మీరు చెప్పిన వాక్యము మన యిరువురకుఁ గాక మఱి యెవ్వరికిఁ దెలియదు గదాతీఇ యని భ్రమించుచున్నారు. లోకమంతయు భగవన్మయమే కాని జడము గాదు. భగవన్మయము కానిది పరమాణువునులేదు. మీరు చెప్పునది సత్యమో యసత్యమో మీ యంతరాత్మ యెఱుఁగదా? అసత్యము వచించు నోరు నశించునదియైనను చేష్టయు భావమును జూచుచు శాశ్వతుఁడై ఆ యా కర్మముల ఫలము నిచ్చు భగవంతుఁడు దేహములో నుండుట తలఁపరా? అంతియ కాదు.

> చ. "విమల యశోనిధీ! పురుష వృత్త మెఱుంగుచు నుం
> డుఁ జూవె వే। దములును, బంచభూతములు,
> ధర్మువు, సంధ్యలు, నంతరాత్మయుఁ । యముఁడును
> జంద్రసూర్యులు, నహంబును,రాత్రియనన్మహా
> పదా। ర్థము లివి యుండఁగా నరుఁడు దక్కొన
> నేర్చు నెతన్ను ముచ్చిలఁ?" భార.

కావున మీ రొనర్చిన ప్రమాణము నావలె నివి యన్నియు నెఱుఁగును.

ఆత్మవంచనం బొనర్చువానికి దేవతలు శుభంబుఁ గూర్పరు. అసత్యమాడువార లిడు శ్రాద్ధంబులు పితరులు గ్రహింపరు. అసత్యవంతునకు ఇహపరములు లేవు. సత్యమందు గౌరవ బుద్ధి లేనివాఁ డెట్టిపాపమైనను జేయ భయపడఁడు. దుష్టుఁడగు పురుషుని వలె దుష్టయగు స్త్రీ నిందింపఁ

దగినది గాని తక్కిన స్త్రీలు నిందింపఁ దగరు. స్త్రీయను సామాన్యగౌరవముచేఁ జూచినను నన్ను మీ రెగ్గాడఁ గారణము లేదు. అంతియ కాదు నేను మీకు భార్యను. ధర్మపత్నిని. నన్ను మీరు నిరాకరింపరాదు.

అనిన రా జిట్లనియె. నీవు నాకు ధర్మపత్నివనుట నేను నమ్మఁజాల. అట్లు నేను బాస చేసినట్టు నాకు జ్ఞప్తికి రాలేదు. నేను నిన్ను భార్యగ గ్రహించియుండిన నిన్నప్పుడే తోడ్కొని వచ్చియుందును. నీ విందు నిలువవలదు. ఎందేని పొమ్ము.

## భార్య పూజ్యులరాలని శకుంతల సిద్ధాంతము సేయుట

శకుం : భర్తను విడిచిన భార్యకు ఏ లోకము లేదన నేనెందుపోఁ గలదాన? మీ మతి మఱపునకు నేను గారణము గాను. నేను మీ వెంటన వచ్చిన మా తండ్రిగారు కోపింతురని నన్నచట విడిచి పరివారమును వాహనములను శీఘ్రకాలమునందే పంపెదనని చెప్పి వచ్చితిరి. సర్వము మఱచిన ట్లిచ్చట నటించుచున్నారు. నన్ను మీరెప్పుడు భార్యగ ప్రమాణపూర్వకముగ గ్రహించితిరో నన్ను భరించు భారము మీయందున్నది. అది మీకు విహితకృత్యము. ఒకరు మిమ్ము హెచ్చరింపఁ బని లేదు. అట్టు లుండియు మీరుమీ కార్యము చేయక పోవుటచే చేయవలసిన కార్యము చేయని పాపము నుండి మిమ్ము విడిపింప నేనై యచ్చటికి వచ్చితిని. తనకు అన్నము పెట్టు చేతిని నోరు కొఱికినట్టు మీకు మేలు చేయవచ్చిన నన్ను ఎగ్గాడుచున్నారు. భార్య యనిన మీరు కొలఁది చూపున చూచుచున్నారు. పతివ్రతయగు భార్య భర్తకు పూజ్యురాలనుట మఱచితిరి.

**కం. ఇలు దిద్దుఁగ నేర్పరియై**
**కులముఁ శీలంబుఁ బ్రోచికొనుచుం బతికిఁ**
**వెలుపలి ప్రాణం బయి కొదు**
**కులఁ గాంచిన యధియె భార్య కువలయనాథా.**

ధర్మమందు, అర్థమందు, కామమందు భార్యను విడిచి చరించుట కే భర్త కధికారము లేదన ఆమెను నిరాకరించుట కధికారము లేదు చెప్పవలయునా?





**కం. సతియును గుణవతియుఁ బ్రజా**
**వతియు ననువ్రతయు నైన వనిత నవజ్ఞా**
**న్వితదృష్టిఁ జూచి నతిదు**
**ర్మతి కిహముం బరముఁ గలదె మదిఁబరికింపఁ.** భార

ఏలయందురా వినుఁడు. హితులలో భార్యయే శ్రేష్ఠురాలు. త్రివర్గంబు భార్యామూలంబు. సంసారసాగరంబునఁ బురుషునకు భార్యయే నావ. భార్యావంతుఁడే క్రియావంతుఁడు. భార్యవంతుఁడే సంతోషవంతుఁడు. భార్యావంతుఁడే శ్రీసమేతుఁడు. జనము లేని యడవులందును ప్రియములు పలుకుచు సఖివలె వర్తించునది భార్యయే. ధర్మకార్యములందు తండ్రివలెను, ఆర్తివేళ తల్లివలెను, ఆలోచనలములందు మంత్రివలెను, కార్యములందు దాసివలెను, వర్తించునది భార్యయే. కాంతారములఁ దిదగువానికిని ఊఱట కలిగించునది భార్యయే. భార్య కలవాఁడే నమ్మఁదగినవాఁడు. కావున భార్యయే పురుషునకు పరమగతి. భార్యయే పురుషునకు ఆత్మ. తన యాత్మయే భార్యయందుఁ బ్రవేశించి పుత్రరూపంబున వెలువడుఁ గావున పుత్రవతియు పతివ్రతయు నగు భార్య తల్లివలెఁ బూజ్యురాలని పెద్దలు చెప్పుదురు. తాను భార్యయందు జనించును గనుకనే భార్యకు జాయయని పేరు. అధిచే దహింపఁబడు నపుడును వ్యాధిబాధితుండగు నపుడును భార్య యెండగొట్టు వడినవానికి చల్లని నీరమువలె తాపము చల్లార్చును. ఎంతటి బలవంతుఁడైనను ఎంతటి గర్వియైనను రతిప్రీతి ధర్మంబులకు ఆలయంబైన భార్య నవమానింపరాదు. తెలివితక్కువవారు భార్యా భర్తృసంబంధంబు కేవలము ఇహలోక సంబంధమని తలఁతురు. వివాహము కామమే ప్రయోజనముగాఁ గలదని తలఁచువారు వెడఁగులు. పురుష దేహమునం దర్థంబు భార్య. పురుషుఁడు చేసిన పుణ్యముల సగము భార్యను బొందును. పురుషునకు మున్న మరణించిన పతివ్రత పరలోకమున కేగి యందుఁ దన పురుషుని గూడ నతని రాకకై నిరీక్షించుచుండు. మున్న పురుషుఁడు మరణించిన సతి బ్రహ్మచర్య మవలంబించి మరణాంతరమున నతనిఁ గూడఁజను. ఇహపర లోకసంబంధము గలది గావుననే పెండ్లిని పరిణయమందురు. భార్యలేనివాఁ డగ్నిహోత్రమైనను జలుప నధికారిగాఁడన భార్య శ్రేష్ఠత్వ మెఱుక పడదా? పరలోకముందేగాక మఱియొక జన్మమందును కూడియుండునది భార్యయే.

కాని తక్కినవారు గారనిన భార్య యుత్తమత్వముఎ తెలియలేదా? ఈ సంబంధ మెడ తెగునది గాదని తత్త్వజ్ఞు లెఱుఁగుదురు. తన కనుకూలవతియు గుణవతియు నగు భార్యను బీడించువాఁడు తన యర్ధదేహమును పీడించువాఁడు. ఆ దోషమును వాఁడు తప్పించుకొనఁజాలఁడు. పరులకు అనుకూలయు చెడునడువడిగలదియు నగు భార్యను మానని రోగముచే చెడిన యంగమువలె విసర్జింపవచ్చును. గాని సుశీలవతి నెన్నఁడు విడువరాదు. దాని మనస్సు నొప్పింపనైన రాదు. అంతియకాదు మఱియు వినుఁడు.

## శకుంతల పుత్రుని శ్రేష్ఠత్వము స్థాపించుట

జనకుని పున్నామ నరకమునుండి రక్షించును గాన కొడుకునకు పుత్త్రుఁడని పేరు. ఏ స్త్రీయందుఁ బుట్టినవాఁడైనను తన్ను రక్షింపఁజాలఁడు. ఇతరుని మడియందు దొంగతనముగ నాటిన విత్తనములవలనఁ గలుగు ధాన్యము తన సొత్తు కాఁగలదా? అంతియకాదు. పరస్త్రీయందుఁ గాంచు సంతానము అనంత నరక బాధలకు కారణమగును. తన భార్యయందుఁ గాంచిన పుత్రుఁడే పుత్రుఁడు. నేల దుమ్ముతో నిండిన పాదంబులతో పుత్రుండు ఱొమ్మునఁ దన్నినను నది ప్రియంబుగఁ దోఁచుట ఆలోచించినచో పురుషునకు పుత్రునకంటె ప్రియమైన పదార్థమేది కలదు? అత్యంత ప్రియుఁడగు పుత్రుని గన్నతల్లి యెట్లు విడనాడ యోగ్యురాలగును? కావున నద్దమునఁ దోఁచు తన ప్రతిరూపమువలెను, దీపమున జనించిన మఱియొక దీపమువలెను, ఉన్న యీ పుత్రునేల నిరాకరించెదరు? చీమలును తమ గ్రుడ్లను తాము మోచి రక్షించుచుండ మనుష్యత్వము గన్న. మీరేల యాత్మ పుత్రు భరింపనొల్లరు? రెండు కాళ్లుగల జీవులందు సద్బ్రాహ్మణుఁడు శ్రేష్ఠుఁడు. నలుగాల జంతువలందు గోవులు శ్రేష్ఠములు. గౌరవార్హులందు గురువు శ్రేష్ఠుఁడు. స్పర్శ సుఖము కలిగించువానియందు పుత్రుఁడు శ్రేష్ఠుఁడు.

చ. **"విపరీత ప్రతిబాషలేమిటికి నుర్వీనాథ! యీ పుత్ర**
**గా। త్రపరిష్వంగసుఖంబుఁ జేకొనుము, ముక్తా**
**హార కర్పూర సాం। ద్రపరాగ ప్రసరంబు చంద**
**నము చంద్రజ్యోత్స్నయుం బుత్రగా। త్రపరిష్వం**
**గమునట్లు జీవులకు హృద్యంబే కదఁ శీతమే".** భార.





మఱియు జాతకర్మాదులందు "నా యంగమువలన నీవు వేఱొక యంగముఁ గొని జనించితివి. నా హృదయము వలనఁ బుట్టితివి. పుత్రరూపమున నుండు నీవే నేను. కావున పుత్రా। శతవర్షంబులు సుఖముగ జీవింపుము. నా జీవితము నీ యధీనము. అక్షయసంతానము నీ యధీనము. కావున పుత్రా నూఱేండ్లు జీవింపుము"అను నర్థముగల మంత్రముల నేల మఱచితిరి? నీళ్లలోని మీ ప్రతిబింబమువలె వీఁడుండుట యేల కనరైతిరి. వీఁడు పుట్టిన సమయమున ఎల్లరు విన "వీఁడు మీకు శోకనాశకరుఁ డును, వంశకరుఁడును, నూఱశ్వమేధములు సేయువాఁడునునగు" నని ఆకాశవాణి చెప్పెను. రాజేంద్రా! నేను అసత్యమాడుదానను గాను. ఊర్వశి, పూర్వచిత్తి, సహజన్య, మేనక, విశ్వాచి, ఘృతాచియను ఆర్వురు అప్సర స్త్రీలయందుత్తమలు. వారి యందు మేనక బ్రహ్మసంభవ. అట్టి యామెయందు రాజర్షియగు విశ్వామిత్రువలన జనించినదానను. వా రిరువురు నన్ను బాల్యమునందే విడువఁ గణ్వమహాముని రక్షించెను.

గీ. **కనులఁ జూచినంత జనకుండు విడనాడె**
**జనని విడిచెఁ బిడప వనమునందుఁ**
**జెట్టపట్టి నతఁడు చేవీడె నిపుడు; ప్రా**
**గ్భవమునం దదెంత పాపమతినొ.**

నృపాలా! మీరు నా మొగమే యెఱుఁగనంటిరి. మీకు నాకు సంబంధమే లేదంటిరి. కానిండు. నా విషయమై నాకు వ్యసనము లేదు. నేను తపోవనమునకు మరలఁ బోవఁగలదానను. మీ కుమారుఁడగు నితని విడుచుట మీకు ధర్మము గాదు.

శార్ఙ్గరవ : శకుంతలా! స్వాతంత్ర్య ఫలమనుభవించుచు ఇంకను బుద్ధిరాలేదా? బాల్యమునఁ దండ్రి, యౌవనంబున భర్త, వార్ధకంబున పుత్రుఁడు వనితలకు రక్షకులు అనుట మఱచితివి. తండ్రిని లక్ష్యము సేయక గుట్టుగ పెండ్లాడి యీ రట్టునకు వచ్చితివి. ఇచ్చట పతిని దిరస్కరించి యెచ్చటికి పోయెదవు? పతివ్రతకు పుట్టినింట రాణివలె నుండుట కంటెఁ బతియింట దాసియై యుండుట మేలు. శీలవతికి పుట్టినింటి పరమాన్నము పతియింటి అంబలి సమానములు. సముద్రుఁ

దెదురొడ్డి తమ్ము నడ్డగించినను దుదకు నదీకాంత లతనినే కదా కలియును. వనపర్వతంబుల వంక మరలునా?

రాజు : దాని మాటలు నమ్మిగదా మీరు న న్నాక్షేపించుచున్నారు?

శార్జర : అవును.

రాజు : ఆడుపిల్ల మాట నిజము నా మాట మీ కసత్యమా?

శార్జర : ఓహోహో ! పుట్టినది మొదలు కల్ల కపటము లెట్టివో వినని వనవాసినుల తాపసుల వృద్ధశిక్షితల శిష్టచరిత్రల వాక్యములు నమ్మరానివియును ఉగ్గుపాలతోడ పరవంచనము పాఠము చేసిన నాగరక వ్యవహారుల అందు రాజుల వాక్యము లాప్తవాక్యములునా?

రాజు : పరస్త్రీల నంటుట యను దోషమునకు భయపడనేని నే నీ సుందరిని నిరాకరింప నేమి కారణము?

శార్జర : మఱపు.

శార : కాదు కాదు. ఇప్పటి భార్యలు తన్ను ఇంటిలోనికి రానీయరని వెఱపు.

శకుం : ధర్మపత్ని నిరాకరించిన పాపఫలం బనుభవింపవలసి.

దుష్య : నీవు నాకు ధర్మపత్నివని సిద్ధాంతమైనఁ గదా నా కా పాపము కలుగును.

శకుం : సిద్ధాంతము మనల నిరువురఁ దగులఁ గట్టిన బ్రహ్మయే చేసియున్నాఁడు. దానిని మీరు తెలిసి నిరాకరించినను, తెలియక నిరాకరించినను మీ కా ఫలము తప్పదు. సాక్ష్యబలముచే, దీర్మానింపఁబడు వ్యవహారములందు వాస్తవవిరోధములు, అన్యాయపుఁ దీర్పులు ఎన్నియున్నవో లోకమునకుఁ దెలియదని తలఁచితిరా?

రాజు : ఇంత వ్యవహారజ్ఞానము గల నీవు తాపసివి కావు. నీవు చెప్పినట్టు దేవదాసియగు మేనక కూఁతురవే. నిండు సభలో నిట్లు విచ్చలవిడి లజ్జ విడిచి నీవు నా మగఁడవు వీఁడు నీకొడుకు అని తెంపరికత్తెవై యుపన్యసించు విధమే నీది నీచపుజాతియని తెలుపుచున్నది. నీవు





వేశ్యపుత్రికవు కావున ఱంకుటాలివలె సంభాషించుచున్నావు. నీవు యాదృచ్ఛికముగు కామరాగబలమున మేనక యందు జనించినదానవుగాని వివాహమైన స్త్రీయందు జనించినదానవు గావు. ఇట్టి నీతోడ నేను సాంగత్యము చేసియుందునా?

శకుంతల ఆ మాటలను విని పట్టరాని కోపము వహించి నల్లకలువల వంటి కాటుక కన్నులను ఎఱ్ఱతామరవలెఁ జేసి మోవి చలించుచుండ చూపుల చేతనే రాజును నిర్దహించునట్టిదయ్యును సభ్యులను భయజనకంబుగ ప్రజ్వలించుచున్న కోపంబును వెలివడుచున్న తపోగ్నిని అతిప్రయత్నముచే నణఁచుచు నిట్టు లనెను. అప్పుడామె మొగము ఎఱ్ఱకలువలచే నలంకరింపఁబడి యుదయించు పూర్ణచంద్రబింబమువలె నుండెను.

శకుం : రాజా! ఉచితానుచితముల నెఱింఁగియు మన తారతమ్యములు తెలిసియు పరువుగల వారినోట రారాని మాటలు నీవు పలుకుచున్నావు. నీవు భర్తవగుట నాకుఁ బూజ్యుఁడవు. కావునను నా కులశీలకారణములచే నీచపువాక్కులు నా నోర రాఁజాలవు. గనుకను నీవు పలికిన విధముగ నేను బలుకఁజాలను. కాక కోకిలము లేక విధముగఁ బలుకఁగలవా? పరుల యందలి దోషమావగింజంత యైనను గొండలుగఁ జేసి చెప్పఁ గలిగిన నీవు కొండలవంటి దోషములను కనలేకయున్నావు. గుంజాన్యాయ మిట్టిదే కదా? మేనక అమర్త్య స్త్రీ. అమర్త్యస్త్రీలు అమృతమయ దేహాలు. సర్వము భక్షించు నగ్ని శుచి యయినట్టును, మనుష్యులు వేనిని చూచిన పాపులగుదురో వానిని సూర్యచంద్రులు చూచియు పాపులు కానట్టును మర్త్యులకు పాపము గలిగించునవి అమర్త్యులు చేసియు పాపులు కారు. బాలురకు జీర్ణింపని పదార్థములు యౌవనవంతులకు జీర్ణశక్తి నాశము చేయదు. నీవు పశువులతోపాటు నేలఁబడి యుండుటయును, వారు తేజోరూపములఁ దాలిచి స్వర్గమున నుండుటయును, నీవు యజ్ఞాదులొనర్చి వారల నర్చించి కొంచెపుఁ గాలమైన నందు వసించుటకు జీవితకాలమంతయు ధారపోయుటయును, నీ వాలోచించిన నీకును దేవతలకును గల భేద మెఱుఁగవచ్చును. అట్టి దేవతా స్త్రీలయందు బ్రహ్మసంభవ యగు మేనక

యుత్తరమురాలు. ఇంక నా తండ్రి నీవలె రాజమాత్రుడు గాడు. నా జన్మము వేళకె మహర్షియు యుండినవాడు. అట్టివారికి నేను కూఁతురను. నీ తల్లిదండ్రు లెట్టివారో యాలోచింపుము. మా తల్లి ప్రభావంబున నే నాకాశగమనంబున నేలోకమందైన సంచారము చేసి రాఁగలను. నీవు సింహాసనము నుండి జిట్టెఁడు లేవ యత్నింతువేని నాకును నీకును మేరువునకు ఆవగింజకున్నంత భేదముండుట బయటపడును.

నేను వేశ్యాపుత్రినంటివి. వాదమునకై యంగీకరించెదఁగాక. నృపనీతియు వేశ్యానీతియు నొక్కటియని పెద్దలు చెప్పఁగా విన్నావు కదా.

గీ. **"సత్యమనృతంబు, పరుషోక్తి సరసభాష**
**ప్రాణిహింసయు దయయు, లోభంబు వీగి,**
**కనక సంగ్రహవ్యయములు కలిగి వార**
**రమణికైవడి బహునీతి రాజనీతి".** భర్తృ

కర్మ చండాలుకన్న జాతిచండాలుఁ డుత్తముఁడనియు శాస్త్రములు ఘోషించుచున్నవి కదా. అటైనచో వేశ్యాపుత్రి మాత్రమైన నేను శ్రేష్ఠురాలనా వేశ్యావృత్తియందుండు నీవు శ్రేష్ఠుఁడవా? సత్కులము నందు జన్మించుట దైవాయత్తము. సుశీలత్వము పౌరుషము మనుష్యస్వాధీనములు. నాకన్న నీవు జాతిచే నత్తముఁడవనుకొన్నను సత్యము ధర్మము లేని నీకంటె తపము శీలము వ్రతము గలిగి పెద్దలచేఁ బెంపఁబడిన నేను ఎన్ని యడుఁగులో యుత్తమురాలను. గుణవతియు, శీలవతియు, ప్రజావతియు నగు ధర్మపత్నిని అసత్యాధర్మములకు పాలుపడి నిండుసభయందు నవమానపఱిచిన కారణముచే నీ శిరము నూఱువ్రక్కలుగఁ జీల నేను నా పాతివ్రత్యము పెంపున శపింపఁగలను. ఏనుఁగు తన నెత్తిమీఁద దానె మన్ను వేసి కొన్నట్టగునని శమింపవలసి వచ్చినది. ఇప్పుడు నేను చెప్పఁబోవు నవి ఉపమానమాత్రములుగ గ్రహించి క్షమింపుము. కురూపి అద్దములో తనరూపు తాను జూచుకొను వఱకు సుందరుఁడననియే తలఁచుచుండును. అద్దములో తన ప్రతిబింబము చూచిన తరువాతనే తాను కురూపియని తెలిసికొనును. కురూపియే సురూపుల వెక్కిరించును. రూప సంపన్నుఁ డెన్నఁ డన్యుల నవమానింపఁడు. దుర్వాక్కులు





పలుకువాఁడే నిందితుఁడగు చున్నాఁడు. అందమైన యుద్యానమందు బురద వెదికి దానితో సంతోషించు పందివలె దుర్జనుఁడు సాధువలయందును దుర్గుణములనే వెదకుచుండును. నీటితోఁ గలసిన పాలయందు పాలనే హంసలు గ్రహించు నట్లు గుణాగుణములందు గుణములనే సాధువులు గ్రహింతురు. సజ్జనులకు పరనింద మృత్యువు. దుర్జలను కది పండువు. సజ్జనులు పరుల గుణముల నెన్ని సంతోషింతురు. దుర్జనులు దుర్గుణము లెన్ని సంతోషింతురు. దుష్టులకు పరనిందయే సదా కార్యము. అయినను సజ్జనులు మరల వారీని నిందింపరు. నాస్తికుఁడును సత్యధర్మహీనుని త్రాఁచుపాములెఁ జూచు నన ఆస్తికుల మాట చెప్పనేల?

వంశకరుఁడగుట పుత్రుని రక్షించుట ధర్మములందెల్ల ప్రథమ కార్యమని పితృదేవతలు వచించిరి. అయిదు తెగల పుత్రులందన్ని విధముల ఆత్మ ధర్మపత్నియం దుదయించిన ఔరసుఁడు యుత్తముఁడే. వాఁడే ధర్మకీర్తులఁ గలిగించువాఁడు. ప్రీతి వర్ధిల్లఁ జేయువాఁడు పూర్వుల నరకమునుండి రక్షించువాఁడు. అట్టి పుత్రుని తెలివి గల వాఁడెవ్వఁడు విడనాడును? నీ వీ పుత్రుని పరిగ్రహించిన నిన్నును నీ పూర్వులను సత్యధర్మములను నుద్ధరించు వాఁడవగుదువే కాని యితరుల రక్షించువాఁడవు కాఁజాలవు. నీవు చెడిపోనొల్లను గాన నీకింతదూరము చెప్పవలసి వచ్చెను. సత్యధర్మములను రక్షించుట రాజనీతిగాని కపటము రక్షించుటగాదు. సత్యము మహిమము నీ వెఱుఁగవు.

చ. **"నుతజలపూరితంబు లగు నూతులు నూఱిటికంటె**
**సూనృత । వ్రత! యొక బావి మేలు; మఱి బావులు**
**నూఱిటికంటె నొక్కసు క్రతువది మేలు;**
**తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు; త ।**
**తత్సుతశతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు**
**చూడఁగ౯."** భార.

కం. **వెలయంగ నశ్వమేధం**
**బులు వేయును నొక్క సత్యమును నిరుగడల౯**
**దుల నిడి తూఁపఁగ సత్యము**
**వలనన ములుచూపు గౌరవంబున పేర్మి౯"** భార.

తే. "సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁ గావు
ఎఱుఁగు మెల్లధర్మంబుల కెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు". భార.



శకుంతల తన కర్మమున కేడ్చుట

కావున సత్యమును మించిన ధర్మంబు లేదు. సత్యమున కంటె తీవ్ర దుఃఖదాయియు అసత్యమున కంటె తీవ్ర దుఃఖదాయియు లేదు. నీవు సత్యధర్మములవదలి యసత్యమును అధర్మమును చేపట్టతివి. ధర్మపత్నినైన నన్ను ఔరసుఁడగు పుత్రుని విడనాడితివి. దుష్టసహవాసము దుడ్డిచ్చి తొలఁగించుకొమ్మని నీతి. కావున నా త్రోవన నేను బోయెద. నీవు నిరాకరించినను నీ యనంతరము నీ పుత్రుఁడగు వీఁడే నీ రాజ్యమేలఁ గలవాఁడని నమ్ముము. నీవు బలవంతుఁడవై సత్యమునకు ధర్మమునకు హాని కలిగించినను భగవంతుఁడు సత్యధర్మ పక్షపాతియగుట నిజము. భగవంతునిచే రక్షింతములగు సత్యధర్మము లెన్నఁడు నాశిలవు. వానికి హాని కలిగించువారే చెడుదురు అని ఆకాశముఁ జూచి "సత్యధర్మమూర్తీ! భగవంతుఁడా! నీవు నాకు శరణము. ఈ రాజువలన





సత్యధర్మములకు హాని ఘటిల్లె ననుట సర్వజ్ఞుఁడవు, సర్వవ్యాపి వైన నీ వెఱిఁగినదియ, నన్నీతఁడు చేవిడిచినందునకై నాకు దుఃఖము లేదు. సత్యధర్మహానికిని, ధర్మవేషము వేసికొనిన యీతని మాటలు నమ్మి తెలివితక్కువచే నేను జేసిన కార్యమువలన నా కుమారునకుఁ గలిగిన అవమానమునకును దుఃఖించెద. నా కెవ్వరును దిక్కు లేరు. ఆపన్నశరణ్యుఁడవగు నీవే శరణము" అని నమస్కరించి సభ విడిచి కోపించిన యాఁడుపామువలె రోఁజుచు పుత్రుతోడ వెడలిపోయెను. అప్పు డందఱు వినుచుండ ఆకాశమున నుండి యొక వాక్కు వినఁబడెను. "రాజా దుష్యంతా! నీవు శకుంతల నవమాన పఱుపకుము. శకుంతల నీకు ధర్మపత్ని. ఆమెయందు జనించిన యీ బాలుఁడు నీ పుత్రుఁడు. వీరి నిరువుర స్వీకరింపుము. పుత్రుని భరింపుము. మా వచనంబున వీని నీవు భరింతువు గాన వీనికి భరతుఁడను పేరు లోకమున విఖ్యాతమగును".

ఈ మాటలు విన్నతోడనే దుష్యంతుని దేహము సంతోషముచే ఉప్పొంగి పోయెను. అప్పుడు రాజు సభ్యులతో నిట్లనియె. "మహాశయులారా! శకుంతల చెప్పినదంతయు సత్యము. లోకనిందకు వెఱచి అసత్యమాడినవాఁడను నేన" అని సింహాసనమునుండి దుమికి త్వరగా పోయి పుత్రు నెత్తుకొని శకుంతల చేతిని బట్టుకొని అందఱు వినుచుండ నిట్లు పలికెను. "దేవీ! మన సమయమున మన కిరువురకుఁ దప్ప లోకమున నిఁకెవ్వరికిఁ దెలియదు. ఇప్పుడు పరీక్షింపక నేను నిన్ను గ్రహించిన నీ సౌందర్యమునకు వలచి నేను నిన్ను గ్రహించితిని అని నాకు అపకీర్తి వచ్చుటయే కాక నీ కొడుకునకును పౌరవుఁడను కీర్తి రాఁజాలదు. అంతియకాక నేను లోకులకు వంకర త్రోవను చూపినవాఁడ నగుదును. ఇదంతయు నాలోచించి మన మువ్వుర శ్రేయస్సు కోరి, నీ మహిమ నే నెఱుఁగుదును, గావున నీ వెంతటి పరీక్షకైన నిలువఁగలవని నమ్మి, యిట్లు తెలియని వానివలె నటించితిని. నీ సత్యమునకు భగవంతుఁడే సాక్షియయ్యె. నీ కుమారునకు నీకు నాకు అపకీర్తియుఁ దొలఁగెను. నీ విప్పు డాడిన మాటలు నాకు జ్ఞప్తియందే లేవు. నే నాడిన మాటలకు కోపింపకుము. క్షమింపుము" అనిన "నాథా! మిమ్ము నేను క్షమించునంతటిదాననా? ఆఁడుదాననుగాన అవమానము సహింపలేక నిబ్బరము తప్పి ప్రేలితిని. మీరే నన్ను క్షమింపవలయును" అని ఋషికుమారులచే సెలవు తీసికొని వారికి చెప్పవలసిన మాటలు చెప్పి రాజు తెప్పించిన పల్లకియందుఁ గూర్చుండి తాను కుమారుని

భర్త కప్పగించి అంతఃపురంబునకు పోయి తరువాత సుఖముండెను. దుష్యంతుఁడు పుత్రుని గూడి ధర్మము తప్పక రాజ్యమేలుచుండెను. ఆ భరతుని పేరనే కదా భరతఖండము, భరతవర్షము అను పేర్లు నేఁటికిని ప్రసిద్ధి వహించియున్నవి.



దుష్యంతుఁడు తన్ను క్షమింపుమని శకుంతలను వేఁడుకొనుట

అమ్మణ్ణి : ఈ కాలమందుఁ గూడ దేవుఁడు సత్యము తప్పనివారికిఁ దోడుపడునా?

తండ్రి : ఏ కాలమందైనను భక్తులుగా నుండు పురుషులకును, పతివ్రతలుగా నుండు స్త్రీలకును దేవుఁడు తోడుపడుచునుండును. ధ్రువుఁడు ప్రహ్లాదుఁడు లోనగు భక్తులను భగవంతుఁడు ప్రత్యక్షమై కాపాడి యుండలేదా. సీతాదేవి, దమయంతి లోనగు స్త్రీలకు దేవతలే వచ్చి సాక్ష్యమిచ్చి రక్షించి యుండలేదా?

అమ్మణ్ణి : సీతాదేవి చరిత్రము చెప్పుము.





రంగన్న : సత్యమును గుఱించి కదా యిప్పుడు కథలు చెప్పుట. ఆ విషయము పూర్తి చేసి తరువాత నింకొక విషయమడుగవలయును. మామా! దుష్యంతుఁడు అసత్యమాడెను గదా, ఆయనకు పాపము గలదా లేదా?

తండ్రి : కొన్ని సందర్భములయందుఁ దప్ప ఎట్టివానికైనను అసత్యమాడిన పాపము తప్పదు. సత్యమును గుఱించి కొన్ని విశేషవిషయములు చెప్పెదను. మీరు జ్ఞప్తియందుంచుకొనుఁడు.

**తే.** **పలుకు సత్యంబు, ప్రియమును బలుకు మెపుడు**
**సత్యమని యప్రియంబును జనదు పలుక**
**నన్ృత మాడంగఁ దగదు ప్రియంబటంచు**
**నిది సనాతన ధర్మమం చెఱుఁగవలయు.**

మఱియొక విశేషము. నీవు సత్యమాడుట వలన నిర్దోషులుగ నుండువారికి ప్రాణహాని గాని మానహానిగాని ధనహానిగాని కలుగు నట్లుండిన నీవు సత్యము చెప్పకుండినను దోషము లేదు. అసత్యమాడినఁ బాపము రాదు. పుణ్యమే వచ్చును. ఎట్లనఁగా ఒక యడవిలో ఋషి యొకఁడు తపస్సు చేయుచుండెను. ఆ మార్గమునఁ బోవు కొందఱు బాటసారులను దొంగలు తఱుముకొని వచ్చిరి. బాటసారులు పరుగెత్తి ఆ ఋషి యాశ్రమమున పొదలలో దాఁగిరి. దొంగలు వచ్చి కొందఱు బాటసారు లీ త్రోవ వచ్చిరే యెట్లు పోయిరని ఋషి నడిగిరి. తెలిసియుండ యసత్యము చెప్పిన పాపము వచ్చునని తలఁచి యా మూఢుఁడు బాటసారు లా పొదలలో దాఁగిరని చెప్పెను. దొంగలు బాటసారులను కొందఱఁ జంపి, స్త్రీలను చెఱిచి వారి సొమ్ముల నపహరించిరి. ఆ పాపము చేత ఋషి నరకమునకుఁ బోయెను. సత్యము చెప్పి బాటసారులను దొంగల నుండి రక్షించు శక్తియుండిన యెడల అసత్యము చెప్పరాదు.

శ్రీ రామానుజాచార్యులవారి పేరు మీరు వినియున్నారు గదా. వారికి వారి గురువులు గొప్ప మంత్రమొకటి యుపదేశించి యది మఱియెవ్వరికిఁ జెప్పఁగూడదని యాజ్ఞాపించిరి. ఎవరికిని జెప్పనని రామానుజాచార్యులవారు ప్రమాణము చేసి చెప్పిరి. ఆ మంత్రమును జపింపఁగా దానియందు గొప్ప మహిమ యున్నట్టు వారు తెలిసికొని, ఒకనాఁడు కంచిలో గరుడోత్సవ

సమయుంబున వేలకొలఁది జనులు మూఁగియుండఁగా అందఱకు ఆ మంత్రమును దెలిపిరి. అది గురువు విని రామానుజాచార్యుల వారిని బిలిపించి నీవు అసత్యమాడితివి కదా యని కోపముతోఁ బలికెను. అప్పుడు వారిట్లు చెప్పిరి. "ఆచార్యవర్యా, నేను మీతో అసత్యమాడినది నిజము. మీరు నా కుపదేశించిన మంత్రము లోకులకుఁ దెలిపి యీ మూఁడు పాపములను జేసితిని. ఈ మూఁడు పాపముల ఫలము నే ననుభవించుటకు సిద్ధపడియున్నాను. తాము నా కుపదేశించిన మంత్రము వలన నే నొకఁడు మోక్షమునకుఁ బోయిన నేమి పోకుండిన నేమి? ఇందఱు లోకులు కష్టపడుచుండ నా యొక్కని సుఖ మొక సుఖమా? ఇప్పుడు నే నొకఁడు నరకమునకుఁ బోయినను ఇందఱు మోక్షమునకుఁ బోదురుగదా" యని సమాధానము చెప్పెను. గురువు రామానుజాచార్యులవారి యుదార హృదయమునకు మెచ్చుకొని అసత్యభయము మాన్పి క్షమించెను. ఉదారచిత్తులు తాము కష్టపడియైన నొరుల సుఖపెట్టుదురు.

రుక్మిణి : నా కింకొక సందేహము. నీవు నాకు అపురూపమగు ఒకపండును దెచ్చి యిచ్చితివనుకో. అది తనకు కావలయునని అమ్మణ్ణి పోరు పెట్టినదనుకో. దానిని సమాధానపఱుచుటకై "ఆ పండు నీ కిచ్చెదను" అని నీవు అమ్మణ్ణికి చెప్పితిననుకో. నీ వడిగినను నా పండు నే నియ్యకుండిన నాకు పాపమా?

తండ్రి : పండు ఇయ్యనందున నీకు పాపము లేదు గాని తండ్రి యాజ్ఞ మీఱిన దానవౌదువు. తండ్రిని అసత్యమాడించిన దానవౌదువు.

అమ్మణ్ణి : శకుంతల కొంతవఱకు మీరు మీరు అని మగని బిలిచి కడపట నీవు నీవు అనెనే ఏల?

తండ్రి : నీ వెవరో నాకు తెలియదు. పో అని రాజు చెప్పువఱకు మఱపు మనుష్య స్వభావమే నిజముగ మఱచెనేమో యను సందేహముచే పెనిమిటిని అగౌరవముగ మాటలాడరాదని మీరు మీరు అని బహువచనమున సంబోధించెను. రాజు నీవు లంజకూఁతురవు బోగము దానివలె నున్నావు అనఁగానే తన పాతివ్రత్యమును దూషించినందున కోపము వచ్చి నీవు నీవు అని మాటలాడెను. మంచి నడవడిగల స్త్రీలు శీలమునకుఁ గలుగు నవమానము సహింపరు.





## ఈ చరిత్రమునందు వచ్చువారి నామములు.

దుష్యంతుడు : పురువంశమునఁ బుట్టిన రాజు. భరతుని తండ్రి. శకుంతల భర్త.

కణ్వుఁడు : శకుంతలను పెంచిన ముని.

శార్ఙ్గరవుఁడు : కణ్వ శిష్యులు. ఇవి కాళిదాసకవి కల్పించిన పేర్లు.
శారద్వంతుఁడు

విశ్వామిత్రుఁడు : శకుంతల తండ్రి.

**స్త్రీలు** :

శకుంతల : దుష్యంతుని భార్య. భరతుని తల్లి. పక్షులు రక్షించుటచే నీమెకు ఈ పేరు కలిగెను.

ఊర్వశి, పూర్వచిత్తి, సహజన్య, మేనక, విశ్వాచి, ఘృతాచి, ఈ ఆర్వురు అప్సరసలు.

మేనకు : శకుంతల తల్లి. దేవతాస్త్రీ

| **పుట.** | | **టీక** |
|---|---|---|
| 17. | సిగ్గరికత్తె – | సిగ్గుగల స్త్రీ |
| 18. | జొంపము – | పూలగుత్తి |
| 19. | వీవనలు – | విసనకఱ్ఱలు |
| 22. | నాఁచు – | పాఁచి |
| 29. | సరోవరము – | శ్రేష్ఠమైన కొలను |
| 32. | శకుంతలములు – | పక్షులు |
| 32 | అన్నదాత – | అన్నము పెట్టినవాఁడు |
| 34. | శీలము – | నడవడి |
| 34. | ఆభరణములు – సొమ్ములు | |
| 34. | నెనరు – దయ | |

35. క్ష్మారమణా – రాజా

35 పరిణయము – పెండ్లి

35 ప్రశస్తము – కొనియాడఁబడినది

35 విలసిత – ప్రకాశించు

37 చెటపట్టవలయు – వివాహమాడవలయు

38 అనవద్యము – దోషము లేనిది

38 నిరుపమ కీర్తి – అసమానమైన పొగడ్త గలవాఁడా!

46 అరణి – యజ్ఞమునందు నిప్పు పుట్టించుటకై రాచెడి కట్టె

47 పౌరవులు – పురువంశమువారు

50. పొల్లువడు – నిష్ప్రయోజనమగు

54. తోయము – నీరు

55. పూరసము – తేనె

56. మావి – మామిడి

59 సంయమధనులము – తపస్సే ధనము గాఁగల వారము

59 దారలు – భార్యలు

73 భర్తవ్య – భరింపఁదగినది

74 ఈలువు – పాతివ్రత్యము

74 ఊఁగలు – ఋూంకులాఁడులు. గయ్యాళులు

76 ప్రత్యుత్పన్నమతులు – సమయమునకుఁ దగినట్టు ఆలోచించు బుద్ధిగలవారు

78 నెయ్యము – స్నేహము

79 కూలంకష – ఒడ్డు నొఱసి పాఱునది

79 పావని – పవిత్రురాలు

91 అభిజ్ఞానము – గుర్తు





94 కఱటి – మూర్ఖుఁడు

97 ప్రతీపదర్శినులు – విరుద్ధపు ఆలోచన గల స్త్రీలు

97 పాపభీరువులు – పాపమునకు భయపడువారు

97 మహిళలు – స్త్రీలు

105 అవజ్ఞాన్వితదృష్టి – తిరస్కారముతోఁ గూడిన చూపు

107 ఆధి – మనోరోగము

107 వెడఁగులు – పిచ్చివారు

111 జ్యోత్స్న – వెన్నెల

113 ప్రాగ్భవము – పూర్వజన్మము

114 వార్ధకము – ముసలితనము

116 ఆప్తవాక్యములు – నమ్మఁదగిన హితుల మాటలు

118 తెంపరికత్తె – సాహసము కలది

120 గుంజాన్యాయము – గురిగింజ తనలోని నలుపు తెలిసికొనలేక పగడమునందు పొడయున్నదని వెక్కిరించునట్టిది.

123 కర్మచండాలుఁడు – కర్మము చేత చండాలుఁడు. ఇతర జాతియందు పుట్టినను చండాలుఁడు చేయఁదగిన కార్యములు చేయువాఁడు

124 మడుఁగులు – అంతలు

124 ప్రజావతి – బిడ్డగలది

126 నాస్తికుఁడు – దేవుఁడు లేఁడనువాఁడు

126 ఆస్తికుఁడు – దేవుఁడు కలఁడనువాఁడు

126 ఔరసుఁడు – తనకు తనభార్యయందు పుట్టిన కొడుకు

128 సుఖదాయ – సుఖమిచ్చునది

129 సత్యధర్మపక్షపాతి – సత్యమునందు ధర్మమునందు పక్షపాతము గలవాఁడు

## భాషా విషయము

రాముఁడు: విద్య నేర్చుట వలన నేమి ప్రయోజనము?

తండ్రి : నిన్న నీవె చెప్పితివి కదా. "చదువని వాఁ డజ్ఞుండగుఁ, జదివిన సదసద్వివేక చతురత కలుగుఁ" అనుపద్యము

రాముఁడు : అది నాకు బాగుగ బోధపడలేదు గనుక అడిగితిని

తండ్రి : తెలిసికొనుటకు ఏది యోగ్యమైనదో అది విద్య. మనుష్యుఁడు తెలిసి కొనవలసిన విషయములు రెండు ఐహికము ఆముష్మికము. ఐహికమనఁగా ఈ లోకమునకు సంబంధించినది. ఆముష్మిక మనఁగా పరలోకమునకు సంబంధించినది.

**విద్యవలనఁ గలుగు ఐహిక లాభములు ఏవనఁగా**

౧. ధనము సంపాదించుట

౨. వ్యవహార జ్ఞానము గలిగి యితరుల మాటలకు మోసపోక తమ తమ కార్యములు తాము చక్కఁగా చేసికొనుటకుఁ దెలియుట

౩. ఏ వృత్తియందు ప్రవేశించినను ఆ వృత్తియందు విద్యాహీనులకంటె మిక్కిలి బాగుగను లాభకరముగను పనులు చేయుట.

౪. శాస్త్రజ్ఞానము గలిగి పండితుఁడను ప్రఖ్యాతి గాంచుట.

౫. ఉద్యోగము సంపాదించుట

రాముఁడు : విద్యవలన ధనము సంపాదింప వచ్చునంటివే విద్య లేకున్న ధనము సంపాదింప సాధ్యపడదా? మా యూరిలో ఒక రైతు నొద్ద పదిలక్షల రూపాయలున్నవి. చేవ్రాలు చేయలేఁడు. ఎన్నెన్ని వ్యవహారములో చేయుచున్నాఁడు.

తండ్రి : విద్య వలన ధనము సంపాదింపవచ్చు నంటినిగాని ధనము సంపాదించుటకు విద్య యొకటే మార్గమని చెప్పితినా? ఇంతకు వాని వాని అదృష్టము కొలఁది వాఁడు పూర్వజన్మమందు చేసిన దాన ధర్మములకలఁది వానికి ధనము కలుగుచుండును. ధనము రమ్మనిన రాదు పొమ్మనిన పోదు.





**చ. వనజభవుండు నెన్నొసట వ్రాసిన సొమ్ము ఘనంబొ**
**కొంచెమో, । విను మరుభూమి కేగిన లభించును**
**మేరువు చేరఁబోయినఁ, । ధనమధికంబురాదు;**
**కడు దైన్యము మానుధనాఢ్యులందు; న। వ్వననిధి**
**నూతఁదుల్యముగ వారిగ్రహించు ఘటంబు చూ**
**డుమా"** భర్తృ.

కావున కేవల ధనాశచే ధనమునకుఁ గానే మిక్కిలి పాటుపడువాఁడు నిందితుండు దుఃఖితుఁడు అగును. అది అట్లు లుండనీ కాని నీవు చెప్పిన రైతు తానే స్వతంత్రించి తన కార్యములన్నియుఁ జేయుచున్నాఁడా?

రాముఁడు: అతని యొద్ద ముగ్గురు నలుగురు మంత్రులున్నారు. వారు చెప్పినట్లు చేయుచుండును.

తండ్రి : నీ రైతు ఒకరు చెప్పినట్టు విను వాఁడేగాని మంచిచెడ్డ తనకుఁ దెలిసి కార్యము చేయువాఁడు కాఁడుకదా. ఇతరుల చెప్పినది మంచిదో చెడ్డదో కనుగొనఁ గలఁడా?

రాముఁడు : ఒకరు చెప్పినట్టు పోవువాఁడే. అధికారులు పిలిపించి రెడ్డీ నీవు మహాదాతవు. రేపుమనమండల ప్రభువు వారు వచ్చెదరు. అప్పుడు నీ పేరు వారితోఁ జెప్పెదము. వెయ్యి రూపాయలు ఇమ్మనిన ఇచ్చును. ఈ ప్రకారము ఉద్యోగస్థులు లోనగువారు తమ సుఖమునకు ప్రతిష్ఠకు కావలసిన కార్యములు నయముననో భయముననోఆయన చేతనే చేయించిరి. వారికి మాట నష్టము వానికిమూట నష్టము. ముందట ఇచ్చకముల ముచ్చట్లు. వెనుక చప్పట్లు. అంతేకాని అతనికి శాశ్వతమైన కీర్తి వచ్చునవియు లోకమున కుపకారముగ నుండునవియు చెప్పువాఁడు లేఁడు. అతనికా తెలియదు. ఆ రైతు నే యెవఁడైన బీదవాఁడు పోయి అయ్యా నా కొడుకులను చదివింపవలెను నెలకు నాలుగు రూపాయల నిమ్మనిన మంత్రులను అడిగి వారిమ్మనిన ఇచ్చును. వలదనిన లేదు పొమ్మనును.

తండ్రి : నీవు చెప్పినది నిజమైన యెడల దాసరు లాడించు గంగెద్దునకు నీ రైతునకు నేమి భేదము? కావుననే విద్యాహీనుఁడు పశువని

నీతిశాస్త్రము దెలిసినవారు చెప్పెదరు. మీ రైతునకు విద్య వచ్చియుండిన యెడల నెంత శాశ్వతమైన కీర్తి సంపాదించియుండఁ గలఁడో తెలిసినదా. కావున ధనము సంపాదించుటకు దానిని కాపాడుటకు దానిని చక్కఁగ వినియోగించుటకు విద్య యెఱిఁగి యుండవలయును. విద్య లేనివాని ధనము, బాలుఁడు కాచు పొలము సమానములు.

విద్య తెలిసినవాఁడు లోకవ్యవహారము నందు కేవలము పరాధీనుఁడుగా నుండఁడు. చదువురానివాఁడు నాలుగక్షరములు గుర్తు వ్రాసికొనవలయుననినను ఎక్కడనుండియైనఁ దనకు వచ్చిన ఉత్తరములోని సమాచారము తెలిసికొనవలయుననినను పరాధీనుఁడే కదా? అయినను అల్పవిద్య అనర్థకరము. కొందఱు చేవ్రాలు చేయుటకు మాత్రము నేర్చుకొని తమ పేర వ్రాయఁ బడిన పత్రములలో నేమున్నదో చదువుకొనలేక వంచకులు అబద్ధము చదువఁగా దానినే నమ్మి ఆ పత్రములలో చేవ్రాలు చేసి నెత్తిమీఁద రాలు వేసికొనుచున్నారు. కొందఱు నాలుగక్షరములు చదువుటకు రాఁగానే గర్వించి పెద్దపిన్న మట్టు మర్యాద లేక సంచరించుచున్నారు. కొందఱు రైతులు చదువ వ్రాయ నేర్చుకొన్న మాత్రము చేతనే సేద్యము చాలించి చలువ అంగీలు సరిగ రుమాళ్లు కుత్తతిత్తులు మేజోళ్లు మరగి భూములు గుత్తలకిచ్చి పల్లెలందు కాఁపురము చాలించి పట్టణములు చేరుచున్నారు. 'పలువిద్య లెన్నియైనను గులవిద్యకు సాటిరాదు. గువ్వలచెన్నా' అనుట వారు తెలియక భ్రష్టులగుచున్నారు. ఏ గ్రంథమైనను చక్కఁగ జదివి దాని అర్థము గ్రహించి శక్తి గలుగువఱకు విద్యనేర్చి తరువాత ఆ విద్యను తమ కులవిద్యను వృద్ధి పఱుచుకొనుటయందు వినియోగింపవలయును గాని అందఱు సొగసులు నాగరకతలు మరగి అందలము లెక్కి మోయు వారెవరు? రైతుగా నుండువాఁడు విద్య నేర్చుకొనిన యెడల ఆ విద్యను కృషిసంబంధమైన గ్రంథములు చదువుటయందును ఏ విధముగ తన భూములు మునుపటికంటె ఎక్కువ ఫలమిచ్చు వానిఁగఁ జేయవచ్చునాయని యాలోచించుట యందును వినియోగింపవలయును. అట్టులే వర్తకుఁడు వడ్రంగి కమసాలి లోనగు జాతులవారు చేయవలయును. ఆ మర్యాద తప్పిన యెడల నియతిచెడి దేశమున





క్షోభము పుట్టును. కావున మన దేశమందు క్షీణించియుండు శిల్పాదులు కులవృత్తులు వృద్ధిపఱుచు మార్గములు తెలిసికొనుటకై విద్యచదువుట బాగు. గర్వగ్రంథులగునట్లు విద్య నేర్చు కొనుటకంటె విద్య నేరువకుండుటే వారికిని ప్రజలకు కూడ క్షేమకరము.

శక్తి-శ్రద్ధ- భక్తి యుండువాఁడు పండితుఁ డగువఱకు విద్య నభ్యసించుటే శ్రేయస్కరము. విద్యావంతుఁడు పేదవాఁడైనను వానికిఁగల గౌరవము మఱెవ్వనికిఁ గలుగదు. ప్రభువులు వారి వారి రాష్ట్రములందే పూజింపఁబడుదురు. విద్వాంసుఁడు సర్వదేశములఁ బూజింపఁబడును. లోకమున నుండు గ్రంథములన్నియు విద్యావంతులు వ్రాసినవే కాని ధనికులు ప్రభువులు వ్రాసినవి కావుగదా? దాని వలన లోకమునకు వారెంత మేలుచేసిరో యూహింపలేవా? ఒకనికి శాశ్వతమైన కీర్తియో అపకీర్తియో కలిగింపవలయుననిన విద్యావంతుఁడే సమర్థుఁడు. ఒక్కనినైన విద్యావంతునిఁ జేరఁదీసిన రాజు సుఖపడును గాని నూరుగురు మూర్ఖులను జేరఁదీసిన వాఁడు సుఖపడఁడు. కావున ఏ విద్యయైనను, పాండిత్యము కలుగువఱకు నేర్చుట యుత్తమపక్షము. స్వవృత్తికి నుపయోగపడువఱకు నేర్చుట మధ్యమపక్షము. అల్పవిద్య హానికరము గావున అల్పవిద్య నేర్చినవాఁడు గర్వి కాకుండుట క్షేమకరము.

గీ. **"మూఢతమబుద్ధు లగువారుఁ బ్రౌఢతమ వి**
**వేకులగువారు సుఖు; లట్లుగాక కొంత**
**ప్రజ్ఞగలవారలై యపప్రతిభులైన**
**జనులు దుఃఖార్తు లగుట నిస్సంశయంబు"** భార.

రంగన్న : పండితులు మూఢులు. వానికి జ్ఞానము లేదు. వివేకము లేదు. అని పిట్టి రామప్పలు చెప్పుచున్నారే అది యేమి?

తండ్రి : నిండుచంద్రుని జూచి కుక్కలేల మొఱుగును? సూర్యుఁ డుదయించిన గూబ లేల కన్నులు మూసికొనును? అట్టులే పండితులను జూచి సహించలేక మూర్ఖులు నిందింతురు. అది వారికి సహజ దోషము. దానివలన పండితుల కేమి నష్టము?

**చ. సకల కలావిభూషితులు, శబ్దవిదుల్ నయతత్త్వబోధ**
**కుల్, । ప్రకటకవీంద్రు లేన్రుపతిపజ్జను నిర్ధనులై**
**చరింతు రా। వికృతపు జాడ్యమాదొరది; విత్తము లేక**
**యు వారు పూజ్యు। లంధక జనదూషితంబులు ఘనం**
**బులు గావె యమూల్యరత్నముల్"** భర్తృ

అని చదువలేదా?

నేను మొదట చెప్పిన ఐదు లాభములలో నాలుగు ఈ లోకమునకు సంబంధించి నవి. పాండిత్యము ఈ లోకమునకు పరలోకమునకుఁ గూడ సంబంధించినది. ఇcక ఆముష్మిక ఫలమేదనcగా విద్యవలన జ్ఞానము కలుగును. జ్ఞానమనcగా మోక్షవిషయమైన తెలివి. ఇట్టి తెలివిగలవాc డిట్టు లాలోచించును. మనమెవరము? ఏల పుట్టి తిమి? ఏల చత్తుము? మనము పుట్టకముందెచ్చట నుంటిమి? చచ్చిన పిమ్మట నెక్కడికి పోదుము? మన దేహమందు మనము అనునది యేది? కన్నా? కాలా? ముక్కా? ప్రాణము పోయిన పిమ్మట నివి అన్నియు నుండును గదా అప్పుడు 'మనము' అను తలcపు ఏల పుట్టదు? దేహము నుండి పోయినది యేది? ఎక్కడికి పోయినది? ఏమై పోయినది? ఒకcడు దరిద్రుcడుగా మఱియొకcగు భాగ్యవంతుcడుగా, ఒకcడు రోగిగా, మఱియొకcడు భోగిగా, ఒకcడు దాతగా, మఱియొకcడు పిసినిగొట్టుగా ఏల యుండవలెను? ఒకcడు నూఱేండ్లు బ్రదుకcగా నింకొకcడు పుట్టినప్పుడే యేల చావవలయును? జనన మరణములను చక్రమునుండి తప్పించుకొని పోవు మార్గము కలదా లేదా? అని యీ విధముగ ఆలోచించు తెలివి జ్ఞానమనcబడును. ఇట్టి జ్ఞానము సంపాదించుటే విద్య వలన ముఖ్య ప్రయోజనము. ఇట్టి జ్ఞానము సంపాదింపక పుస్తకములలో నుండునది మాత్రము తలలో నెక్కించుకొని యుండు వాcడు చలువగుడ్డల మోపు మోయు గాడిదవంటివాcడు. కావున విద్యవలన కేవలభుక్తి అధమ ప్రయోజనము. జ్ఞానము ఉత్తమ ప్రయోజనము గనుక చదువcదలcచిన ప్రతి మనుష్యుcడు నీతిమతాచారములు నేర్చి జ్ఞానవంతుcడగుటకును చదువవలయును.

రంగన్న : హీనజాతులకును తక్కినవారికిని సత్రములు విజ్ఞాపన పత్రికలు లోనైనవి వ్రాయుటకు వ్యవహారసంబంధ పత్రికలు చదువుటకుc దెలిసి చాలునని యొకcడు వ్రాసినాcడే.





తండ్రి : అది తెలివిలేని మూట. కాళ్లు దోcగాడుటకే గాని నడచుటకును పరుగెత్తుటకును గావనుట యెట్టిదో ఆ వాద మట్టిద. జాతి తక్కువ యైనంత మాత్రమున వ్యవహారములోనే మునుcగవలయును. జ్ఞానము సంపాదింపరాదని సిద్ధాంతమా యేమి? నీవు చెప్పినది నీ పిట్టిరామప్పవాదము కాcబోలు. అది పోనీ. విద్యా విషయమైన మీరు యీ పద్యములు చక్కcగ నేర్చుకొని అర్థమును గ్రహింపుcడు.

**గీ. "విద్య యొసcగును వినయంబు, వినయమునను**
**బడయుc బాత్రత, పాత్రత వలన ధనము**
**ధనమువలనను ధర్మంబు, దానివలన**
**నైహికాముష్మిక సుఖంబులందు నరుcడు.**

**గీ. జరయు మృతియులేని జనునట్లు ప్రాజ్ఞుండు**
**ధనము విద్యc గూర్పc దలcపవలయు;**
**ధర్మమాచరింపc దగు మృత్యుచేc దల**
**పట్టి యీడ్వcబడినవాcడు పోలె"** భార.

**సీ. "కమనీయ విద్య దాc । గామధేనువు భంగిc**
**గామితార్థంబులు । గలుగc జేయు**
**సజ్జన పండిత । సంఘంబులోపల**
**మానుగాc దనుc బెద్ద । మాన్యుc జేయు**
**నెన్ని దేశంబులు । కేగిన సాయమై**
**తల్లిచందంబునc । దన్నుc బ్రోచుc**
**బన్నుగాc దన పుణ్య । పాపంబు లెఱిcగించు**
**సాధించు నిహపర । సాధనంబు**

**గీ. నగ్ని గాలదు, రాజుల। కలవిగాదు,**
**వారి నానదు, చోరుల । పాలు గాదు,**
**అన్నదమ్ముల పాళ్లకు । నలవి గాదు**
**చెలcగి విద్యాధనమునకుc । జేటు లేదు".**

